# సోవియట్ సమీక్ష

సోవియట్ అమెరికా సంబంధాలు:
గత, భవితవ్యాల పర్యావలోకనం

పెరిస్త్రోయికా, మానవ హక్కులు

లెనిన్ నైతిక వారసత్వం

త్సియొల్కోవ్‌స్కీ రోదసీ సిద్ధాంతం

బుఖారిన్ విషాద మరణం

4
1988

# సంబంధాలు







మాస్కోలో ప్రముఖ ఇటాలియన్ నటుడు మర్సెల్లో మస్త్రోయిన్నీతో యింటర్వ్యూ

పద్మాసుబ్రమణ్యం, ఆమె సోవియట్ స్నేహితురాలు స్వెత్లానా త్రుబ్నికోవా

స్పెయిన్ మేయర్ ప్రొఫెసర్ ఫెడ్రికోతో సోవియట్ సాంస్కృతికసంస్థ ఛైర్మన్ అకడమీషియన్ ద్మిత్రి లిఖాచేవ్

ఏప్రిల్ 22 న
లెనిన్ 118 వ జయంతి.
ఆయన
మహా మేధావి
గొప్ప విప్లవకారుడు,
చరిత్రలోనే
మొట్టమొదటి
సోషలిస్టురాజ్య స్థాపకుడు.
ప్రపంచ
సామాజిక రూపురేఖలను
సమూలంగా
మార్చి వేసిన
20 వ శతాబ్దపు
బృహత్తర విజయాలు
ఆయన పేరుతో, ఆలోచనలతో,
కార్యకలాపాలతో
సన్నిహితంగా
ముడివడి వున్నాయి.

# ఈ సంచికలో



## సోవియట్ రాజ్యమూ మతపీఠము

**25**

క్రైస్తవ మతానికి రూస్‌మారి వెయ్యేళ్ల యింది. యీవుత్సవాన్ని 1988 వేసవిలో సోవియట్ యూనియన్‌లోని అనేక క్రైస్తవ చర్చీలు, ప్రత్యేకించి రష్యన్ ఆర్థడాక్స్ చర్చి జరుపుకుంటాయి.

**35**

**42**

అంతరిక్ష శాస్త్రానికి సైద్ధాంతిక పునాదివేసిన **కన్‌స్తంతీన్ త్సియొలోవ్‌స్కీ** ప్రతిభను అందరూ గుర్తించారు. ఆయన తాత్వికభావనల గురించి ప్రజలకు తెలిసినది చాలా తక్కువ. ఆయన యీ విశ్వ పరిణామ నమూనాను పేర్కొని అందులో మానవుని పాత్రను విశదీకరించాడు.



సోవియట్ సమాజపునరుజ్జీవన, పునర్నవీకరణ పరిస్థితుల్లో లెనిన్ సైద్ధాంతిక, నైతిక వారసత్వంపై తమ దృష్టిని కేంద్రీకరించాలనే బలమైన కోరిక యిప్పుడు సోవియట్ ప్రజల్లో వుంది.



# లెనిన్ నైతిక వారసత్వం ఆధునిక కాలం

# ఆఫ్గనిస్తాన్: జాతీయసామరస్య పథంలో

53

జాతీయ సామరస్యం - యీ రెండుపదాలు ఆఫ్గనిస్తాన్‌లోని విభిన్న సామాజిక, వయో బృందాల ప్రజల, అన్నిజాతుల, తెగల ప్రజల నోళ్లలో నలుగుతున్నాయి. యీ జాతీయ సామరస్యం అనే భావన ఆఫ్గన్ నాయకత్వ సత్సంకల్పానికి ప్రతీక. జీవితపు అత్యున్నత విలువ అయిన శాంతిని స్థాపించి, పరిరక్షించడం దీని లక్ష్యం.



విదేశాంగ విధాన సమస్యలు

# సోవియట్ అమెరికా సంబంధాలు:

## గత, భవితవ్యాల పర్యావలోకనం

అకడమీషియన్ యెవగెనీ ప్రిమకోవ్

మధ్య శ్రేణి, స్వల్పశ్రేణి మిసిలీల నిర్మూలన సంధికి దారితీసిన సోవియట్ అమెరికా వాషింగ్టన్ శిఖరాగ్ర సమావేశం యిటీవలికాలంలోని అతి ముఖ్య ఘటన అని చెప్పవచ్చు.

ఈ ఒప్పందం కుదరడం యాదృచ్ఛికమా? రెండవసారి పదవీకాలం ముగిసేలోగా ఆయుధాల నియంత్రణ సమస్యను పరిష్కరించాలని అధ్యక్షుడు రీగన్ నిర్ణయించు కున్నాడన్నది నిజమేనా? లేదా దీని వెనుక కొన్ని లోతైన వస్తుగత కారణాలేమైనా వున్నాయా?

ఈ ప్రశ్నలకు సమాధానం చెప్పాలంటే మొట్టమొదట గతంలోని కొన్ని ఘటనలను గుర్తుచేసుకోవాల్సి వుంది.

అమెరికా బల ప్రయోగంతో సోవియట్ యూనియన్‌ను వెనక్కి నెట్టివేయ ప్రయత్నిస్తూ వచ్చింది. మనం దీన్ని శక్తివంతంగా తిప్పి కొట్టాము. దాంతో అమెరికా ఆయుధపోటీని పెంచింది తుదకు ఆయుధ నిల్వలు పెరిగిపోయి మానవాళికి అణుయుద్ధ మారణహోమ ప్రమాదం యేర్పడింది.

ఈ సమస్యలో ఆర్థికాంశం కూడా వుంది. అమెరికా సవాళ్లకు విధి లేక మనమూ "సరిసమాన" చర్యలతోనే సమాధానం చెప్పాము. అయితే ఈ "సరిసమాన" చర్యలవల్ల సోవియట్ యూనియన్ పైన అమిత ఆర్థిక భారంపడింది. సోవియట్ యూనియన్ జి.ఎన్.పి అమెరికా జి.ఎన్.పి. కన్నా యెంతో తక్కువ.

ఒక యూనిట్ జాతీయాదాయాన్ని పొందడానికి మనం అమెరికాకన్నా 80 శాతం యెక్కువ మౌలిక ఆస్తులను, 60 శాతం యెక్కువ పదార్థాలను, 110 శాతం యెక్కువ శక్తినీ వుపయోగిస్తున్నాము. కాగా 1970 లలో, 1980 ల ఆరంభంలో, మన ఆర్థిక వ్యవస్థలో, సామాజికాభివృద్ధిలో మాంద్యం యేర్పడటంతో పరిస్థితి క్షీణించింది.

**సోవియట్ అమెరికా సంబంధాలు: గత, భవితవ్యాల పర్యావలోకనం**

దీన్నంతటినీ పరిగణనలోకి తీసుకుని పార్టీ 1985 మార్చి ప్లీనం సోషలిజం, మొత్తంగా ప్రపంచం భవితవ్య సమస్యను పరిశీలించింది. సమాజ మౌలిక ప్రజాస్వామ్యీకరణ, ఆర్థిక పునర్వ్యవస్థీకరణ, నూతన ఆలోచనాధోరణి సూత్రాల అనువర్తన — ఈ చర్యలవల్ల సోషలిజాన్ని రక్షించగలం, మానవాళి సంపూర్ణ విధ్వంసనను నిరోధించగలం, అన్న దృక్పథం సరియైనదేననడానికి సాక్ష్యాధారాలు అంతకంతకూ ఎక్కువవుతూ వచ్చాయి.

ఈ రెండు లక్ష్యాలూ పరస్పర సంబంధం గలవి. మనం పునర్నవీకరణ విధానానికి దూరమయితే అంతర్జాతీయ పరిస్థితులు విషమిస్తాయి. ఆయుధ పోటీ పెరిగి యెంతో ప్రమాదకర పరిస్థితి ఏర్పడుతుంది.

1985 ఏప్రిల్ ప్లీనం నాటి నుండే పార్టీ నూతన విదేశాంగ విధాన తాత్వికతను రూపొందించ సాగింది. అణుయుద్ధానికి దారితీసే ధోరణులను వెనక్కి మళ్ళించాలనీ, మనదేశరక్షణ కోసం మన బంధుదేశాల రక్షణకోసం కేటాయించే నిధులకూ (దీని ఆవశ్యకాన్ని గురించి యెవరికి అనుమానం వుండనవసరం లేదు) సత్వరవుత్పత్తి పెరుగుదల కోసం, సామాజికాభివృద్ధి కోసం కేటాయించే నిధులకూ మధ్య అత్యంతోపయుక్తమైన సంబంధం వుండేలా చూడాలనీ మనం అనుకున్నాము.

పార్టీ 27 వ మహాసభ పత్రాల్లో, తర్వాతి ప్లీనరీ సమావేశ పత్రాల్లో మిహాయిల్ గోర్బచేవ్ ప్రసంగాలు, వ్యాసాలల్లో, విదేశాంగ విధానంలో నూతన ఆలోచనా ధోరణి సూత్రాలను విశదీకరించడం జరిగింది; అవి :

—రాజ్యాలకు భిన్నజాతీయ ప్రయోజనాలు, వున్నాయనీ అయితే, యీ రాజ్యాల మధ్య సారూప్య అంశాలను అన్వేషించాల్సిన అవసరం వుందనీ నిరావేశంగా అంగీకరించడం;

—ఏ రాజ్యానికైనా దానిరక్షణకు, యితర రాజ్యాల రక్షణను దెబ్బతీయడం వల్ల లాభించదనే నూతనవైఖరి అవలంబించడం;

—ప్రస్తుత పరిస్థితులలో భద్రతకు హామీ లభించేలా చూడడానికి రాజకీయ పద్ధతి మాత్రమే ప్రధాన సాధనం అని నొక్కి చెప్పడం, సహేతుకంగా చాలినన్ని ఆయుధాలుంటె సరి పోతుందన్న దృష్టితో సైనిక విషయాల్లో వ్యవహరించడం; –పరిస్థితులనుఅంచనా వేయడంలో,

వివాదాలను పరిష్కరించుకోవడంలో, వాస్తవిక వైఖరిని అవలంబించడం;

—ప్రజాభిప్రాయంపై ప్రభావం నెరపే సాధనంగా గ్లాస్నోస్త్‌ను వుపయోగించడం.

వాషింగ్టన్‌లో జరిగిన సోవియట్—అమెరికన్ సమావేశం కోసం యెంతో కృషి చేయాల్సి వచ్చింది. తాను ప్రగతికి అడ్డుకట్టవేస్తానని, మొట్టమొదట్లోనే స్పష్టం చేసిన ప్రస్తుత అమెరికా ప్రభుత్వంతో సమావేశం వుపయోగకరమా కాదా అన్నవిషయంపై సోవియట్ పత్రికా ప్రపంచంలో కూడా కొన్ని అభిప్రాయ భేదాలు వచ్చాయి. నూతన దృక్పథ సమర్థకుల చారిత్రక ఆశావాదం నిస్సందేహంగా సరియైనదని ఋజువైంది. ఆశావాదపు జోస్యం కేవలం చెప్పడమేకాదు. దానికి దైనందిన కృషితోడ్పాటు నిచ్చింది. యీ ఫలితాలు వచ్చింది దాని వల్లనే.

మనదేశం మరింత యెక్కువ ప్రజాస్వామ్యం, సంస్కరణ, బాహాటతలకు కట్టుబడి వుండటంతో, ధైర్యంగా సర్దుబాటుకు వీలైన ప్రతిపాదనలను చేయడంతో పాశ్చాత్య ప్రపంచంలో ప్రజాభిప్రాయంలో మార్పు రానారంభించింది. వాషింగ్టన్ శిఖరాగ్ర సమావేశం విజయవంతంకావడానికి యిది యెంతో తోడ్పడింది. అయితే చాలాకాలంగా శత్రుభావంతో కూడిన ప్రచారంవల్ల ప్రజల్లో యేర్పడ్డ మూసపోతభావాలను పూర్తిగా నిర్మూలించడం అంతసులభం కాదు. ఆదిశగా మనం పయనించాల్సిన మార్గం సుదీర్ఘమైనదని వేరే చెప్పనవసరం లేదు. అయితే, యిప్పుడున్న పరిస్థితి, కొంతకాలం క్రితపరిస్థితికి పూర్తి విరుద్ధంగా వుంది. అమెరికా ప్రజల్లో 60 శాతం మంది సోవియట్ యూనియన్ ''దుష్ట సామ్రాజ్యం'' అని నమ్మేవారని లాస్ ఏంజెల్స్ పత్రికమూడేళ్ల క్రితంసేకరించిన ప్రజాభిప్రాయంలో తేలింది. దాదాపు 70 శాతం మంది అలా నమ్మడంలేదని యిటీవలి సర్వే నిరూపించింది.



అన్నదే ప్రశ్న. సంబంధిత ఒప్పందం కుదిరిన పక్షంలో అంతర్జాతీయ నియంత్రణ రూపాలనూ, ప్రత్యక్ష తనిఖీ రూపాలనూ వుపయోగించాలని సోవియట్ యూనియన్ చెప్పగానే మనపై నీలాప నిందలు వేసేవారి నోరు కట్టుబడి పోయింది. యిది ప్రజాభిప్రాయం మనపట్ల అనుకూలంగా మారేందుకు తోడ్పడింది.

వాషింగ్టన్ శిఖరాగ్ర సమావేశం యీ కింది రంగాల్లో ప్రభావం నెరపగలదని నేననుకుంటున్నాను: తదనంతర క్రమంగా ఆయుధాల్లో తీవ్రకోత; కొన్ని రంగాల్లో అంతర్జాతీయ సాధారణీకరణ కోసం జరుగుతున్న కృషికి యితర రంగాల్లోని కృషిని లంకెగా పెట్టకుండా వుండడం, అదే సమయంలో ఆయుధ పోటీ అంతానికి ప్రాధాన్యత యివ్వడం; మితవాదంనుండి మధ్యే మార్గానికి అమెరికా రాజకీయాలు మారడం.

పెట్టుబడిదారీ దేశాల్లో విదేశాంగ విధానానికి సంబంధించినంత వరకూ, ప్రజాభిప్రాయమే నిర్ణాయకమైనదికాదు. అయితే, పచ్చి అభివృద్ధి నిరోక పథకాలకు కళ్లెంవేసి యింగిత జ్ఞానానికి పట్టం కట్టడంలో ప్రజాభిప్రాయం తన ప్రభావాన్ని విదితం చేస్తోంది. నిరాయుధీకరణకు, ముఖ్యంగా ఆయుధాల తగ్గింపు, నియంత్రణలకు చెందిన కీలక సమస్యల విషయంలో మనదేశం వెనులుబాటు తనం దీనికి తోడ్పడుతున్నది.

కేవలం జాతీయ సదుపాయాల సహాయంతో మాత్రమే నియంత్రణ జరగాలని మనం పట్టుబట్టడం పాశ్చాత్య దేశాల వారికి బొత్తిగా నచ్చలేదని, అందువల్ల నియంత్రణ పట్ల మనవైఖరిని మనం మార్చుకోవాలని మిహయిల్‌గోర్బచేవ్ జెనీవాలో సోవియట్ నిపుణులకు చెప్పారు.

మన సమాజం గుంభన స్వభావం కలదని నియంత్రణపట్ల అమెరికాకున్నంత ఆసక్తి మనకు లేదనీ వస్తున్న ఆరోపణలకు అవకాశం యివ్వాలా

మనదేశం అనుసరిస్తున్న విధానం సరియైనదేనని రుజువైంది. అందువల్లనే వుభయ పక్షాలూ వాషింగ్టన్‌లో మధ్యశ్రేణి, స్వల్ప శ్రేణి మిసిలీల నిర్మూలన సంధిపై సంతకాలు చేయడమేగాక, అంగీకృత కాలం పాటు ఎ.బి.ఎం సంధిని పాటించినట్లయితే వ్యూహాత్మక దాడి ఆయుధాలను సగానికి తగ్గించడం సాధ్యమనే ఒప్పందపు కీలక నిబంధనలు పెక్కింటిని కూడా రూపొందించగలిగాయి.

దీనితో పాటు సోవియట్ యూనియన్, మానవ హక్కుల సమస్యకు సంబంధించిన రాజకీయ వ్యూహాగానాల వుద్రిక్తతను గణనీయంగా తగ్గించింది. ఆయుధాల తగ్గింపును అడ్డుకునేందుకు యీ వ్యూహాగానాలు ఒకసాధనంగా పాశ్చాత్య వర్గాలకు తోడ్పడ్డాయి. అసలు ఆయుధాలను తగ్గించడానికి ముందు ప్రాంతీయ ఘర్షణలు పరిష్కారం కావాలనీ, విశ్వాస సంవర్ధన జరగాలనీ జెనీవాలోని సోవియట్ అమెరికా శిఖరాగ్రసమావేశం ముందు అమెరికా ప్రతినిధులు ప్రతిపాదించిన విషయం ప్రతిఒక్కరికీ జ్ఞాపకం వుంటుంది. కాని, **1987** డిసెంబర్‌లో వాషింగ్టన్‌లో

జరిగినది గతంలో జరిగినదానికి యెంతో బిన్నంగా వుంది. సంప్రదింపుల్లో పాల్గొన్న పక్షాలు మానవహక్కుల సమస్యతో సహా అన్ని విషయాలనూ ద్వైపాక్షిక ప్రాతిపదికపై చర్చించాయి. గతంలోలా ప్రతి చర్చనీయాంశాన్ని ఆయుధాల తగ్గింపుతో పోటీ పెట్టలేదు. యిది యెంతో ముఖ్యమైన విషయం.

యిప్పటికీ వుభయదేశాల మధ్య అనేక భేదాభిప్రాయాలు వున్నాయి. యిక ముందూ వుంటాయి. అయినప్పటికీ, ఆయుధాల తగ్గింపు పథంలో ముందుకు వెళ్లే కొద్దీ మానవ హక్కులతో సహా ప్రస్తుత తక్షణ సమస్యల పరిష్కారానికి వీలు కల్పించే కొత్తపరిస్థితి యేర్పడుతుందన్నది స్పష్టమే.

నూతన మనస్తత్వం యెమాత్రం లేని అమెరికాలోని పచ్చి అభివృద్ధి నిరోధక శక్తులు యిప్పటికీ బలంగా వున్నాయి. వాషింగ్టన్‌తో కుదిరిన ఒప్పందాలను యిక యేమాత్రమూ ప్రత్యక్షంగా వ్యతిరేకించలేని యీ అభివృద్ధిని నిరోధక శక్తులు యీ క్రమం కొనసాగుతున్న కొద్దీ యిదేరకంగా మిన్నకుంటాయని చెప్పలేము. శిఖరాగ్ర సమావేశంలో జరిగిన అభిప్రాయాల మార్పిడికి వ్యతిరేకంగా డిసెంబర్ 16 న అమెరికా బైనరీ రసాయనిక ఆయుధాల వుత్పత్తిని ప్రారంభించడం యిందుకు ఒక వుదాహరణ.

కాని, నేడు, అమెరికాలోని పచ్చిఅభివృద్ధి నిరోధకులు నిర్ణయాలు చేయడంపై తమగుత్తాధికారాన్ని కోల్పోయారు. మిహయిల్ గోర్బచేవ్ వాషింగ్టన్ సందర్శన రాజకీయ ఫలితాల్లో యిది కూడా ఒకటి. తన రాజీవైఖరిని సమర్థించుకుంటూ అధ్యక్ష్యుడు రీగన్ ఒక ఇంటర్వ్యూలో, తానిది వరకు యే కరుడు గట్టిన అభివృద్ధి నిరోధకవర్గాలపై ఆధారపడ్డాడో. ఆ వర్గాలనే విమర్శించారు.

ఇక ముందు పరిస్థితి యెలా వుండబోతుంది? నూతన విజయాలు, సాధిస్తాము. బహుశామార్గం వంకరటింకరగా వుండవచ్చు. పెద్ద వెనుకంజలు వుండవని ఆశిద్దాం. యెందువల్లనంటె ప్రస్తుతం మానవాళికి మరో మార్గంలేదు.

**భారతదేశంతో సంబంధాలకు సోవియట్ విదేశాంగ విధానం ప్రాధాన్యత నిస్తోంది. యిది సహజమే: భారతదేశం ప్రపంచంలో ఒక ప్రధాన శక్తి: ఆసియాలో మనకు సన్నిహితంగా వున్నదేశం. వర్తమాన ప్రపంచంలో సోవియట్ యూనియన్ భారతదేశాలకుగల స్థానం, పాత్ర దృష్ట్యా వాటి మధ్య స్నేహ, సహకారాలు ప్రపంచ ప్రాధాన్యతగల అంశాలయ్యాయి.**

## చారిత్రక సామ్యాలు

ఈ స్నేహ సహకారాలు హటాత్తుగా వూడి పడినవేమీకావు. యివి ద్రవ్యపరమైన ప్రయోజనాలనుండి వుద్భవించిన వేమీకావు. యివి ఏకరీతిగా అభివృద్ధి చెందుతున్నాయి. సోవియట్ భారత సంబంధాలు యీరెండు మహత్తర దేశాల చారిత్రక బాంధవ్యం వల్ల యేర్పడినవి. 1917 నాటి అక్టోబరు సోషలిస్టు మహావిప్లవ సంవత్సరానికీ, భారతదేశం స్వాతంత్ర్యం సాధించిన 1947 సంవత్సరానికీ మధ్య అభేద్యమైన సహజ అంతస్సంబంధముంది. యీ విధంగా రష్యాలో, భారతదేశంలో ఆవిర్భవించిన నూతన ప్రపంచం, స్వేచ్ఛాయుత సహకారం నెరపుకునే విముక్త ప్రజల నూతన ప్రపంచం పాతదైన, చారిత్రకంగా కాలగర్భంలో కలిసిపోయే ప్రపంచంతో, జాతి పీడన, రాజకీయహుకుములు, దురాక్రమణ యుద్ధాల ప్రపంచంతో ఢీకొనవలసి వచ్చింది.

ఈ రెండు మహత్తర దేశాల చారిత్రక గమ్యాల ఏకతను రష్యా, భారత్‌లలోని వుత్తమోత్తములు స్పష్టంగా దర్శించారు. భారత్‌లోని జాతీయ విముక్తి వుద్యమాన్ని సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటంలో ఒక భాగంగా లెనిన్ పరిగణించారు. ప్రపంచజనాభాలోని అత్యధికులు రష్యా, భారత్, చైనాలలో వున్నందున యీ పోరాట ఫలితాన్ని యిదే నిర్ణయిస్తుందని, ప్రాచ్యదేశాల జాతీయ విముక్తి పోరాట

# సోవియట్-భారత సంబంధాలు

## ప్రపంచ ప్రాధాన్యతగల అంశం

ఇవాన్ గ్లెబోవ్

యోధులతో సంబంధాన్ని పెంచుకోవాలని, రష్యన్ విప్లవ కారులకు లెనిన్ విజ్ఞప్తిచేశారు. నవభారత శిల్పి జవహర్‌లాల్ నెహ్రూ అక్టోబరు సోషలిస్టు మహావిప్లవాన్ని శకకారక ఘటనగా పేర్కొంటూ, అది నూతన నాగరికతకు పునాది వేసిందన్నారు. దోపిడీని నిర్మూలించేందుకు పోరాడుతున్న శక్తులతో తన శక్తులను ఐక్యం చేయటంలోనే భారత దేశ భవిష్యత్తువుందని మహాకవి రవీంద్రనాథ్‌టాగూర్ అన్నారు.

బయటి శక్తుల కుట్రలను తిప్పికొట్టడానికి సోవియట్ యూనియన్ భారతదేశానికి అనేక సందర్భాల్లో సహాయం చేసింది. ఆధునిక జాతీయ ఆర్థిక వ్యవస్థను, పరిశ్రమలను అభివృద్ధి చేసుకునే బృహత్తర కర్తవ్యంలో తరుణ భారతదేశానికి సోవియట్ యూనియన్ అన్నివిధాలా సహాయపడింది. పరస్పర ప్రయోజనకర సోవియట్ - భారత సహకారం క్రమక్రమంగా రాజకీయ, ఆర్థిక, వాణిజ్య, శాస్త్ర, సాంకేతిక రంగాలకు విస్తరించింది.

### ద్వైపాక్షిక సహకార లక్ష్యాలు

ఉభయదేశాల మధ్య సంబంధాల్లో కాలక్రమేణా ప్రోదిఅయిన సానుకూల, పరస్పర ప్రయోజనకర అంశాలన్నీ 1971 ఆగస్టు 9న కుదిరిన సోవియట్ భారత శాంతి, స్నేహ, సహకారసంధిలో మూర్తీభవించి వున్నాయి. అంతేకాదు యీ సంధి యీ రెండు మహత్తర దేశాల ప్రజల ఆశలను, ఆశయాలను, ప్రపంచ అభివృద్ధిపట్ల వారి దృక్పథాన్ని ప్రతిబింబించింది. యీ సంధి శీర్షికలోని శాంతి, స్నేహ సహకారం అనే పదాలు సోవియట్ యూనియన్, భారతదేశాల లక్ష్యాలను ప్రత్యక్షంగా తెలియజేస్తున్నాయి.

సహజీవనం, సహకారం ప్రాతిపదికగా ప్రపంచ క్రమ వ్యవస్థను నెలకొల్పడం చారిత్రకంగా అవసరమని మన స్నేహం ధ్రువీకరిస్తున్నది అని భారత ప్రధాని రాజీవ్‌గాంధీ అన్నారు. సామ్రాజ్యవాదాన్ని తిరస్కరించడం, వలసవాదానికి, జాతివివక్షతకు వ్యతిరేకంగా పోరాడడం, దేశ దేశాల ప్రజల

సమానత, సామాజిక న్యాయ సూత్రాల పట్ల పూర్తి నిబద్ధత యివి సోవియట్-భారత మైత్రికి జవజీ వాలనిచ్చే కారకాలని భారత ప్రధాని అభిప్రాయం.

సోవియట్, భారత సంబంధాలు అంతర్జాతీయ రాజకీయాల్లో నూతన ఆలోచనధోరణికి విలక్షణమైన అనేక అంశాలను ఆవిర్భవింపజేశాయి. యీ రెండు దేశాల మధ్య సంబంధాలు ఆరంభం నుండీ నమ్మకం, సమానత్వం, పరస్పర గౌరవం, ఒకరి ప్రయోజనాల పట్ల మరోకరి శ్రద్ధ పై ఆధారపడివున్నాయి. వర్తమాన బహుముఖ పరస్పర విరుద్ధ ప్రపంచం విడదీయవీలులేనిది, పరస్పరాధారిత మైనదని వుభయదేశాల అభిప్రాయం. సోవియట్, భారత సంబంధాల్లో "శాంతి యుత సహజీవనం, ఉపకారం ధ్యేయంగా గల పరస్పర ప్రయోజనకర సహకారంలాంటి అంతర్జాతీయ వ్యవస్థ అంకురాలున్నాయి. యివి అంతర్జాతీయ నియమాతా తాయి" అని మిహాయిల్ గొర్బచేవ్ పేర్కొన్నారు.

పైన పేర్కొన్న వుదాత్త మానవ లక్ష్యాల కోసం పోరాడడానికి సోవియట్, భారతదేశాల పరస్పర నిబద్ధత అనేది గొర్బచేవ్, రాజీవ్‌గాంధీ సంతకాలు చేసిన ఢిల్లీ ప్రకటనలో మూర్తీభవించి వుంది. యీ పత్రం నూతన ఆలోచనాధోరణికి ప్రతీక. మానవాళి భవితవ్యాన్ని గురించి ఆలోచించాలనీ, సామూహిక విధ్వంసక ఆయుధాల బెడదలేని, యుద్ధాలులేని, హింస, విద్వేషం, జాతీయ, ఆర్థిక వివక్షతలేని ప్రపంచస్థాపన కోసం తక్షణమే సంయుక్త చర్యలు తీసుకోవాలని సకలదేశాలకు యీ ప్రకటన విజ్ఞప్తి చేసింది.

## అహింస: అంతర్జాతీయ సంబంధాలకు సార్వత్రిక నియమం

ప్రపంచ కుటుంబానికి సోవియట్, భారత నాయకులు ఒక నిర్దిష్టమైన, సుస్పష్టమైన కార్యాచరణ పథకాన్ని సమకూర్చారు. తలపాటుకు బదులు సకల రాజ్యాల స్నేహ సహకారాలు, అణ్వాయుధాలకు బదులు మానవ యోచనాశక్తి నిర్ణయాత్మక పాత్రవహించే ప్రపంచ నిర్మాణ పథకమది. అలాంటి ప్రపంచంలో ప్రతిఒక్క రాజ్యానికి జాతికి స్వతంత్ర ఎంపిక హక్కు వుంటుంది.

**ప్రపంచ ప్రాధాన్యతగల అంశం**

ఉభయదేశాల మహత్తర ప్రజల శతాబ్దాల విజ్ఞత, నూతన ఆలోచనా ధోరణి ఢిల్లీ ప్రకటనలో తొణికిసలాడుతోంది.

యీ ప్రకటన..కు ఐ.రా.న. అలీనోద్యమం, "ఆరు రాజ్యాల బృందం" నుండి విస్తృత తోడ్పాటు లభించింది. పాత పద్ధతుల్లో మనుగడ సాగించడం యిక యేమాత్రం సాధ్యం కాదని కరడుగట్టిన సాంప్రదాయాలుగల దేశాలుకూడా గుర్తించ నారంభించాయి. ఢిల్లీ ప్రకటన భావనలు ప్రపంచంలోని నైతిక, రాజకీయ వాతావరణంపై సానుకూల ప్రభావం నెరపుతాయి. అంతర్జాతీయ సంబంధాలను మెరుగు పర్చడానికి తోడ్పడుతాయి.

స్వల్ప శ్రేణి, మధ్యశ్రేణి మిసిలీల నిర్మూలన గురించిన అమెరికా, సోవియట్ ఒప్పందం యిందుకు సుస్పష్ట వుదాహరణ. ప్రస్తుత అణ్వాయుధాగారాల్లోని మూడు శాతం ఆయుధాలను మాత్రమే తగ్గించడం యీ ఒప్పందం లక్ష్యమైనప్పటికీ యిది ప్రపంచ ప్రాధాన్యత గల ఘటన. యెందుకంటే సుదీర్ఘ ప్రయాణం మొదటి అంజతోనే ప్రారంభమౌతుంది. దీని తర్వాత ఎ.బి.ఎం సంధిని పాటిస్తూ వుభయదేశాలు వ్యూహాత్మక ఆయుధాల్లో 50శాతం తగ్గింపు ఒప్పందం కుదుర్చుకుంటాయని ప్రపంచ ప్రజానీకం ఆశిస్తోంది. యిందుకు భారతదేశం తనవంతుగానూ, "ఆరు రాజ్యాల బృందం" పరిధిలోనూ కృషిచేస్తోంది.

హిందూ మహాసముద్రాన్ని శాంతిమండలంగా మార్చడం లాంటి అత్యంత ముఖ్యమైన, తక్షణమైన సమస్యపై యీ వుభయదేశాల వైఖరులు ఒకే విధంగా వున్నాయి. అణ్వస్త్రరహిత ప్రపంచం యేర్పాటును యీ రెండుదేశాలు బలపరుస్తున్నాయి. తమ సొంత అణ్వాయుధాలను అభివృద్ధి చేసుకోడానికి ఆసియాలోని కొన్ని వర్గాలు చేస్తున్న ప్రయత్నం యీ దేశాలకు ఆందోళనకరంగా వుంది.

ఆసియాలోని దేశాల ప్రజల చట్ట బద్ధమైన ప్రయోజనాలను పరిగణనలోకి తీసుకుని ఆమండలంలోని ఘర్షణలను పరస్పర ఆమోదయోగ్యమైన రాజీల ప్రాతి పదికమై పరిష్కరించడాన్ని సోవియట్ యూనియన్, భారత దేశాలు బలపరు

స్తున్నాయి. ఇరాన్, ఇరాక్‌ల మధ్య జరుగుతున్న అర్థంహీతమైన యుద్ధాన్ని నిలిపివేయాలని కోరుతున్నాయి. శ్రీలంకలోని నరవర్గాల ఘర్షణ పరిష్కారానికి భారత ప్రధాని శ్రీరాజీవ్‌గాంధీ, శ్రీలంక అధ్యక్షులు జయవర్ధనే సంతకాలు చేసిన ఒప్పందంవల్ల సోవియట్ యూనియన్ తన హర్షాన్ని ప్రకటించింది. యీ ఒప్పందం దక్షణాసియా మండలానికీ, మొత్తం ప్రపంచానికీ యెంతో ముఖ్యమైనదని సోవియట్ యూనియన్ అభిప్రాయం

ఆఫ్ఘనిస్తాన్, కంపూచియాలలో జాతీయ సామరస్య విధానాన్ని వుభయ దేశాలూ బలపరుస్తున్నాయి. ఆఫ్ఘనిస్తాన్, కంపూచియాల్లోని పరిణామాల వల్ల మధ్య అమెరికా, అంగోలాయింకా వుద్రిక్తతా ఆలవాలుగా వున్న యితర ప్రాంతాల్లో రాజకీయ, ప్రజా నాయకులు ఆసక్తి కనబర్చారు. యిది గమనించదగ్గ విషయం.

దక్షిణాసియా మండలంలో రాజ్యాల మధ్య నమ్మ కాన్ని, పరస్పర అవగాహనను పటిష్టం చేయడానికి భారత దేశం చేస్తున్న కృషి యెంతో విలువైనది. వర్ధమాన దేశాలు తమ రాజకీయ స్వాతంత్ర్యాన్ని, ఆర్థిక స్వావలంబనను పటిష్టం చేసుకోడానికి విడివిడిగా, సంయుక్తంగా చేస్తున్న కృషిని సోవియట్ యూనియన్ సదా బలపరుస్తూనే వుంది.

ఆసియా ఖండం శాంతియుతంగా అభివృద్ధి చెందడానికి నిజమైన అవకాశాలు వున్నాయని సోవియట్ యూనియన్ అభిప్రాయం. యీ అభిప్రాయంతో భారతదేశం యేకీభవిస్తోంది. ఆసియాలో, మొత్తం ప్రపంచంలో నూతన తరహా సంబంధాలకు పంచశీల, బాండుంగ్ సూత్రాలు సైద్ధాంతిక, రాజకీయ చట్రాన్ని పాదుకొల్పాయని శ్రీరాజీవ్‌గాంధీ అన్నారు. ఆసియాలో విశాలభూభాగమున్న సోవియట్ యూనియన్, యీ ఖండంలో శాంతి, స్థిరత్వం, అభివృద్ధీ, సహకార నూతన నమూనాను సృష్టించేందుకుద్దేశించిన కృషిలో భాగస్వామిగా వుండాలనేది సహజమేనని శ్రీ రాజీవ్‌గాంధీ అన్నారు.

అంతర్జాతీయ రంగంలో సోవియట్, భారత సంయుక్త కృషి ప్రపంచ ప్రాధాన్యతగల అంశం. శాంతి, భద్రతల ప్రయోజనాలకోసం అది వినియోగిస్తున్న గణనీయమైన శక్తి సామర్థ్యాలకు అనేక మిత్రదేశాల దన్నువుంది - యీ విధంగా యీ రెండు దేశాల సహకారం యుద్ధ వ్యతిరేక, అణ్వాయుధ వ్యతిరేక విస్తృత సంఘటన యేర్పాటుకు, శాంతి, మైత్రి, విజ్ఞానాయుత సంఘటన యేర్పాటుకు దారి తీస్తుంది.

సోవియట్, భారత దేశ నాయకుల మధ్య క్రమానుసార వ్యక్తిగత సంబంధాలు వుభయ దేశాల మధ్య మంచి సాంప్రదాయాలను నెలకొల్పాయి. **1955** వేసవిలో జవహర్‌లాల్ నెహ్రూ సోవియట్ పర్యటన, ఆతర్వాత సోవియట్ నాయకుల భారత పర్యటన, వున్నత స్థాయిలో విశ్వాస పూరిత, నిర్మాణాత్మక చర్చలు - యివి సోవియట్ భారత బహుముఖ సహకారానికి వెన్నెముక అయ్యాయి.

ఈ సందర్భంగా **1985-1987**లలో మిహాయిల్ గోర్బచేవ్, రాజీవ్‌గాంధీల మధ్య జరిగిన సమావేశాలను ప్రత్యేకించి పేర్కొనాలి. యివి సోవియట్ భారత సహకారాన్ని రాజకీయ రంగంలోనేగాక వాణిజ్య ఆర్థిక, శాస్త్ర సాంకేతిక, సాంస్కృతిక రంగంలో కూడా గుణాత్మకంగా నూతన స్థాయికి తీసుకెళ్లేందుకు పునాదివేశాయి.

## ఆర్థిక వాణిజ్య సహకారం

సోవియట్ భారత వాణిజ్య, ఆర్థిక సహకారం యితర దేశాలకు ఒక మంచి ఆదర్శాన్ని సమకూర్చింది. యిందులో నూతన అంతర్జాతీయ ఆర్థిక వ్యవస్థకు సంబంధించిన అంశాలు యెన్నో వున్నాయి. వుభయదేశాలమధ్య వాణిజ్య, ఆర్థిక సహకారరంగంలో, సహకారాన్ని మౌలికంగా విస్తరించడమే గాక దాని పునర్ వ్యవస్థీకరణకు కూడా ప్రాధాన్యత యివ్వడం జరిగింది. **1986** నవంబరులో మిహాయిల్ గోర్బచేవ్ భారతదేశ పర్యటన సందర్భంగా కుదిరిన ఆర్థిక, సాంకేతిక సహకార ఒప్పందం వుభయదేశాల సహకార చరిత్రలోనే అపూర్వమైనది. యీ ఒప్పందం ప్రకారం తెహ్రీలోని జలవిద్యుత్ సముదాయంలాంటి ప్రాజెక్టులను పూర్తి చేయడానికి, బొకారో వుక్కు ఫ్యాక్టరీ

ఆధునికీకరణకు, అందులో కొత్త పరికరాలను అమర్చడానికి, జారియాలో నాలుగు బొగ్గు గనుల నిర్మాణానికి, పశ్చిమ బెంగాల్‌లో చమురు, గ్యాస్ అన్వేషణకు సోవియట్ యూనియన్ సహాయపడు తుంది.

సహకార పరిధిని సమూలంగా పెంచడానికి ఉభయదేశాలలోని అనేక పరిశ్రమలు, సంస్థలు పాల్గొనడం అవసరం. యిందుకోసం. 1987లో అనేక దీర్ఘకాలిక కార్యక్రమాలను ఆమోదించడం జరిగింది. యివి వుభయదేశాల సమ్మేళనల, సంస్థల మధ్య ప్రత్యక్ష సంబంధాలు, వుభయదేశాల్లో సంయుక్త పరిశ్రమల యేర్పాటు, శాస్త్ర సాంకేతిక రంగంలో అత్యంత అధునాతన విభాగాల్లో సంయుక్త పరిశోధనకు సంబంధించిన కార్యక్రమాలు.

వర్ధమాన దేశాలకు అధునాతన సాంకేతిక పరిజ్ఞానాన్ని యేదో ఒకసాకుతో అందుబాటులో లేకుండా చేయడానికి కొన్ని పారిశ్రామిక దేశాలు ప్రయత్నిస్తున్న విషయం అందరికీ తెలిసిందే. యిలాంటి పద్ధతులు సోవియట్ యూనియన్‌కు పూర్తిగా పరాయమైనవి. యీ రంగంలో అది సాధించిన విజయాలను భారతదేశంతో కలసి పంచుకుంటోంది. భారతదేశం ప్రపంచ ప్రమాణాలను సాధించిన శాఖల్లోని అనుభవాన్ని సోవియట్ యూనియన్ విస్తృతంగా వినియోగించదలచింది. భారతదేశ వుత్పత్తులకు కస్టమ్స్ సంబంధమైన అవరోధాలను సోవియట్ యూనియన్ సృష్టించడం లేదు. భారత సాంకేతిక పరిజ్ఞానాన్ని అది కొనుగోలు చేయదలచింది. సోవియట్ యూని యన్‌లో పరిశ్రమాది సంస్థలను, హొటళ్లను, యితర ప్రాజెక్టులను భారతదేశ ప్రభుత్వ, ప్రయివేట్ సంస్థలతోడ్పాటుతో నిర్మించ తలపెట్టింది.

## ప్రజలను సన్నిహితం చేసే సంస్కృతి

క్రమానుసార సోవియట్ భారత శిఖరాగ్ర సమావేశాలు, వున్నత స్థాయి సమావేశాలు, వుభయదేశాల ప్రభుత్వాల మధ్య పెరుగుతున్న సంబంధాలు - వీటికి ప్రజా దౌత్యం బలమైన దన్నుగావుంది. సోవియట్ యూనియన్‌లో భారతదేశ వుత్సవాలు భారతదేశంలో సోవియట్‌యూనియన్ వుత్సవాలు యీ విషయాన్ని స్పష్టంగా తెలియజేస్తున్నాయి. అపూర్వమైనయీవుత్సవాల సందర్భంగా వుభయదేశాల మిలియన్లాది ప్రజలు ఒకరి జీవితాన్ని సంస్కృతిని మరొకరు తెలుసుకోడానికి, వీలు యేర్పడింది.

ప్రతి ఒక్కదేశ సంస్కృతి మొత్తం మానవాళికి చెందినదే. సంకుచిత మత, జాతి వర్గ తత్వాన్ని రష్యా, భారతదేశాల్లోని వుత్తమోత్తములు సర్వదా తిరస్కరించారు. మానవాళి సృష్టించిన సర్వ సంపదల పరిజ్ఞానంతో తమ జ్ఞాపక శక్తిని పరిపుష్టం చేసుకోవాలని యువజనులకు లెనిన్ విజ్ఞప్తిచేశారు. తన దేశంలో సకల దేశాల సాంస్కృతిక వాయువులు వీయాలని భారతదేశ మహత్తర పుత్రుడు మహాత్మాగాంధీ కోరుకున్నారు. నిజమైన మానవీయకళ దేశదేశాల ప్రజల మధ్య సన్నిహిత సంబంధాలను నెలకొల్పడానికి, పరస్పర అవగాహనను పెంపొందించడానికి సర్వదా తోడ్పడుతూనే వుంటుంది. వర్త మాన ప్రపంచం పరస్పరాధారితమైనదనీ, అఖండమైనదనీ గుర్తించిన దృష్ట్యా యిలాంటి పరస్పర అవగాహన ప్రత్యేక ప్రాధాన్యతను సంతరించుకుంది.

మానవాళికి శాంతియుతమైన ప్రపంచాన్ని నిర్మించడమనేది ఒక సుదీర్ఘమైన, కష్టసాధ్యమైన క్రమం. ప్రస్తుత పరిస్థితుల్లో సోవియట్ భారత విస్తృత సహచర్య, సహకారం యెంతో విలువైనది. యీ సంబంధాల వున్నత స్థాయి, నునవన్న స్వభావం; ఫలదాయకమైన రాజకీయ సంభాషణలు; సమర్థమైన ఆర్థిక సంబంధాలు; సాంస్కృతిక ఆదాన ప్రదానాలకు గల విస్తృతావకాశాలు —యివి వుభయదేశాల ప్రజలకు, మొత్తం ప్రపంచ మానవాళికి అనుగుణమైనవి. యివి శాంతియుత సహకారానికి దృష్టాంతం; నూతన న్యాయమైన, ప్రజాస్వామ్య యుతమైన ప్రపంచ వ్యవస్థ స్థాపనకు దోహదం చేసే అంశం.

(మొజ్డునర్నోయా జిజ్న్ నుండి)

స మాజాన్ని మరింత ప్రజాస్వామ్య మొనర్చాలని కృషి చేస్తున్న దృష్ట్యా మానవ హక్కులకు స్వేచ్ఛలకు పూర్తి గౌరవాన్నివ్వడం, వాటికి భంగం కలగకుండా పరిరక్షించడం ముఖ్య అవసరాలలో ఒకటి. చట్ట ధిక్కారానికి అధికార్లు పాల్పడిన సందర్భాలలో వాటిని మరుగు పర్చడానికి యత్నించడం సమాజానికి నష్టం. దానివల్ల అధికార దుర్వినియోగ గవరుల నిరంకుశ చర్యల నుంచి ప్రజలకు రక్షణ లేకుండా పోతుంది. అసలు సోషలిస్టు సమాజ స్వభావం దృష్ట్యానే ఏ మానవ హక్కులనైనా పెట్టుబడిదారీ దేశాలలోకన్నా మరింత సంపూర్ణంగా అమలు జరపాల్సి వుంది.

# పెరిస్త్రోయికా

# మానవ హక్కులు



పెరిస్త్రోయికా క్రమంలో వ్యక్తిపట్ల ప్రత్యేక శ్రద్ధ దృష్ట్యా మానవ హక్కుల రంగంలో పరిస్థితిని జాగ్రత్తగా పరిశీలించడం అవసరం.

ఐరాస నిబంధనావళి 1948 నాటి మానవ హక్కుల సార్వత్రిక ప్రకటన, 1'966 నాటి మానవ హక్కులపై అంతర్జాతీయ ఒప్పందాలు - వీటన్నిటినీ రూపొందించడంలో సోవియట్ యూనియన్ పాల్గొంది. యివి సార్వత్రికంగా అందరూ అంగీకరించినవి, ప్రజాస్వామ్య స్వభావం గలవి.

ఈ హక్కులను వాటి అమలుకు, రక్షణకు అంతర్జాతీయ ప్రమాణాలను, పాశ్చాత్యదేశాల ప్రతినిధి వర్గాలతో కలసి సంయుక్తంగా రూపొందించడం జరిగింది. సోషలిస్టు భావాలు, బూర్జువా భావనలమధ్య ఒక రాజీగా యివి ఏర్పడినందున అందరికీ ఆమోదయోగ్యమైనవి.

ఈ ఒప్పందాలలో ప్రకటించిన భావాలు అనేక దేశాలలో చాలవరకు మంచి ఉద్దేశాల ప్రకటనలుగా మాత్రమే మిగిలిపోయాయి. స్వయం నిర్ణయాధి కారం, పనిచేసే హక్కు, విశ్రాంతి హక్కు, విద్యా హక్కు తదితర హక్కులను యీ సందర్భంలో పేర్కొనవచ్చును. అయితే యివి సోవియట్ యూనియన్‌లో ఒక వాస్తవం అయినాయి. వేరు మాటల్లో చెప్పాలంటే మానవ హక్కుల రంగంలో అంతర్జాతీయ ప్రమాణాలు అనేవి సాధించాల్సిన ధ్యేయంగా మిగిలి పోయే పరిస్థితి సోవియట్ యూనియన్‌కు ఎంతమాత్రం లేదు. (సోషలిజాని

-వై. కుద్రవ్‌త్సెవ్, ఎం.ఏ. న్యాయ శాస్త్రం

కి సైద్ధాంతిక శత్రువులైనవారు అలా చూపడానికి ప్రయత్నిస్తుంటారు.) యీ హక్కులు, ప్రమాణాలు అన్నవి సార్వజనీనమైన కనీస ప్రజాస్వామిక నియమం, అంతే తప్ప ఏదో ఆదర్శంగా మిగిలి పోవల్సినవి కావు అన్నది సోవియట్ వైఖరి.

సోవియట్ పౌరుల సామాజిక కార్యకలాపాలు పెరగడం,' పరిపాలనలోనూ నిర్ణయాలు చేయ డంలోనూ వారు మరింత ప్రగాఢంగా నిమగ్నం కావడం జరుగుతూన్న యీ సమయంలో వ్యక్తికీ సమాజానికీ మధ్య సంబంధంపట్ల జాగ్రత్తగా శ్రద్ధ వహించి క్రమబద్ధం చేయడం అవసరం. మన సమాజం అభివృద్ధి చెందుతూండిన సమయంలో దీనికి సబంధించిన అనేక సమస్యలను పరిష్కరించే కృషి, విజయం భిన్న పరిమాణాలలో వుండింది. అయితే వ్యక్తి పరమైన విషయాలలో మౌలికంగా నూతన వైఖరులు అవసరమని తోస్తుంది.

## పెరిస్త్రోయికా మానవ హక్కులు

ఉదాహరణకు నేర విషయాల న్యాయస్థానం జరిపే విచారణా క్రమంలో నేరం రుజువు అయ్యే పర్యంతం నిర్దోషిగా భావించాలన్నది, యావత్ నాగరికప్రపంచం అంగీకరించిన సూత్రం. పౌర రాజకీయ హక్కులపై అంతర్జాతీయ ఒప్పందంలోని ఆర్టికల్ 14 పేరా 2 లో యిలా నమోదు చేయడం జరిగింది. "నేరం ఆపాదిత మైన వ్యక్తి చట్టప్రకారం దోషి అని రుజువు అయ్యేంతవరకు సదరు వ్యక్తిని నిర్దోషిగా భావించే హక్కు ఆ వ్యక్తికి వుండాలి" సోవియట్ చట్టం యీసూత్రాన్ని మరింత స్పష్టంగా చట్టంలో రూపొందించింది:" చేసిన నేరానికి ఒక న్యాస్థానం విధించిన శిక్ష అమలులోకి వచ్చిన అనంతరం మాత్రమే ఏవ్యక్తినైనా దోషిగా పరిగణించాల్సి వుంటుంది."

ఒకవ్యక్తిని స్వేచ్ఛగా చట్టవిరుద్ధంగా తిరస్కరించడం అనుమతించరాని విషయమని ఈ ఒప్పందంలోని 9వ ఆర్టికల్ పేర్కొంటున్నది. డిఫెన్స్ తరపు న్యాయవాది లేకుండా నిర్బంధ చికిత్స నిమిత్తం పంపిన సందర్భాలలో తీవ్ర సమస్యలు ఉత్పన్నమవుతున్నాయి.

అన్ని హక్కులలోకి అతి మౌలికమైన హక్కును యిప్పుడు పరిశీలిద్దాం: అది జీవించే హక్కు (ఒప్పందంలోని ఆరవ ఆర్టికల్) అనేక దేశాలలో మరణ శిక్ష అమలులో వుందన్న వాస్తవాన్ని ఈ ఒప్పందం దృష్టిలో పెట్టుకుంటున్నది. అందువల్ల మరణ శిక్షను రద్దుపర్చాలని అది కోరడంలేదు. కాని ఆ శిక్షను అమలు జరిపేటపుడు పాటించాల్సిన షరతులను నిర్దేశిస్తున్నది. ఈషరతులను సోవియట్ చట్టంలో కూడా పొందు పర్చడం జరిగింది. అయితే యిటీవలి సంవత్సరాలలో యీ శిక్షను రద్దు చేయాలన్న డిమాండ్ ప్రపంచంలో వస్తున్నది.

మరణశిక్ష అమానుషమైనందువల్ల రద్దు చేయాలని ఐరాసలో జరిగిన చర్చల్లో కోరడం జరుగుతూంది. జి.డి.ఆర్. మరణ శిక్షను రద్దు పర్చింది. సోవియట్ యూనియన్‌లో మూడు పర్యాయాలు యీ శిక్షను తొలగించడం, అనంతరం తిరిగి ప్రవేశపెట్టడం జరిగింది.

సోషలిస్టు మానవతా దృష్టితో ఆ శిక్షనే పూర్తిగా రద్దు చేస్తే మంచిది. కేవలం దారుణ హత్యలకు పాల్పడ్డ నేరస్తులకు దానిని పరిమితం చేయ వచ్చు. ఏ నేరస్తుడికైనా కేవలం ఆ శిక్ష వేయడం తప్ప మార్గం లేదనుకోవడం ఆ సమాజపు నిస్సహాయతను ప్రతిబింబిస్తుంది. సోషలిజం నైతికంగా పెట్టుబడిదారీ విధానం కన్నా వున్నత స్థాయికి చెందింది. అందువల్ల ఎంతటి దుస్సహనీయమైన నేరాలుచేసినా మరో విధంగా శిక్షించేందుకు సోషలిజం ప్రయత్నించాలి.

భావ ప్రకటనా స్వేచ్ఛను, రాజ్యాంగం సమకూర్చింది. జరిగిన తప్పుల్ని గురించి చాలా కాలం మౌనం తర్వాత బాహాటతా క్రమం అమలు జరుగుతున్న ప్రస్తుత సమయంలో వెల్లువలాగా విమర్శలు వస్తున్నాయి. వాటిలో కొన్ని అతిశయోక్తులు. ఎషయాల్ని బహిరంగ పర్చేవారు వాటికి ఆధారాలు చూపే బాధ్యత వహించేటట్టు చేయాలి. ఆ తీర్పులను అంచనా వేసేందుకు గీటురాళ్లను సమకూర్చాలి. భావ ప్రకటనా స్వేచ్ఛకు హేతుబద్ధమయిన పరిధులను గురించి పరిశీలించడం అవసరం.

కోట్లాది ప్రజలను బానిసత్వం నుంచి విముక్తి చేసి, ఆకలి, నిరుద్యోగం వంటి సమస్యల నుంచి రక్షణ కల్పించడంలో మన విజయాలు, పెట్టుబడిదారీ వ్యవస్థపై మన ఆధిక్యత నిజంగా గర్వదాయకం అయితే జనబాహుళ్యం "కోట్లాది ప్రజలు"

అనే భావాలతో వ్యవహరించేటపుడు సామాజిక ఆర్థిక హక్కులను అనుభవించే కీలక అంశమైన వ్యక్తిని గురించి మరిచి పోవడం జరగవచ్చు. జనరాసిలో ఒకడు అయిన వ్యక్తిని నిర్లక్ష్యం చేసినపుడు ఏర్పడిన పర్యవసానాలు చరిత్రలో అన్ని దేశాలలోనూ అన్ని కాలాల్లోనూ ఒకే విధంగా వున్నాయి. సర్వసాధారణంగా ఆర్థిక, శాస్త్ర సాంస్కృతిక రంగాల్లో స్తబ్దతకు అది దారితీసింది. రాజకీయాలలో శాసన రాహిత్యం, నిరంకుశ పోకడలకు దారితీసింది. 1930లు, 1950లల్లో సామూహిక అణచివేతల నుంచి యిటీవల దశాబ్దాలలో సామాజిక రంగం విషయంలో అవలంభించిన కేవలం సాంకేతిక దృష్టి వరకూ అనేక రూపాలలో యీ పర్యవసానాలు వ్యక్తమైనాయి. సామాజిక చట్రంలో ప్రతి వ్యక్తికీ సరైన స్థానాన్ని తిరిగి కల్పించి అతడిని నిజమైన యజమానిగా తీర్చి దిద్దడం దేశంలో జరుగుతున్న పునర్ వ్యవస్థీకరణ లక్ష్యాలలో ఒకటి. ప్రజలకు వారి హక్కులూ, వాటిని రక్షించుకునే పద్ధతులూ సంపూర్ణంగా తెలియాలి అప్పుడే అధికార్ల చర్యలవల్ల వారి హక్కులకు నష్టం జరగకుండా నివారించ వీలుంటుంది.

ఉదాహరణకు పని చేసే హక్కును తీసుకుందాం అంతర్జాతీయ ఒప్పందంలోనూ, సోవియట్ రాజ్యాంగంలోనూ దీన్ని పొందుపర్చారు. అయితే గర్భిణి అనే పేరిటో, లేక ఒకప్పుడు నేరస్తుడనే కారణంగానో వుద్యోగాలను ప్రత్యక్షంగా గాని పరోక్షంగాగాని తిరస్కరించడం జరుగుతోంది.

విదేశాలలో బంధువులు వుండకూడదనీ, పార్టీ సభ్యత్వం వుండాలనీ, ఒక నిర్దిష్ట జాతికి చెంది వుండాలనీ వుద్యోగాలకు అర్హతలలో ప్రత్యేకంగా కోరడం జరుగుతోంది. కొన్ని వుద్యోగాల విషయంలో యీ అర్హతలు తప్పనిసరి అవసరం కావచ్చు. అయితే ఆ విషయాన్ని స్పష్టంగా వాటికి సంబంధించిన చట్టాలలో పొందుపర్చాలి. ఏ కారణాలతోనైనా వివక్షత చూపడాన్ని సోవియట్ రాజ్యాంగం మానవ హక్కులకు సంబంధించిన అంతర్జాతీయ ఒప్పందాలూ నిషేధించాయి.

అయితే సామాజిక ఆర్థిక హక్కులను ఏ మేరకు అమలు పర్చగలరూ అనేది ఆయా సమాజపు అభివృద్ధి స్థాయిని బట్టి వనరులను బట్టి ఆర్థిక వ్యవస్థ స్వరూప స్వభావాలను బట్టి ఆధారపడి వుంటుంది. మానవ హక్కులకు చట్టపరమయిన హెూదా కల్పించాలన్నది వాస్తవికమయిన దృష్టి కాదని పాశ్చాత్య దేశాల ప్రతినిధులు వాదిస్తుంటారు.

సోవియట్ యూనియన్ యీ హక్కులను రాజ్యాంగంలో పొందుపర్చిందీ అంటే అది సోషలిజం సారానికి వ్యక్తీకరణ. అంతే తప్ప ప్రచారం కోసం వుద్దేశించింది కాదు. ప్రభుత్వమూ ప్రజలూ చట్టం దృష్టిలో సమానులనే, రాజ్యాంగంలో పొందుపర్చిన హక్కులూ విధులూ వుంటాయనే సూత్రం బూర్జువా ప్రజాతంత్ర దృష్టిలో మానవహక్కుల భావనకు పునాదిగా శతాబ్దాల తరబడి వుంది. బలమైన న్యాయ వ్యవస్థను ప్రభుత్వ అధికారం నుంచి విడదీయడం వల్ల మానవ హక్కులకు గ్యారంటీలు ఏర్పడతాయనే భావన కలగవచ్చు. అయితే బూర్జువా సమాజంలో ప్రకటించిన హక్కులన్నీ కేవలం మంచి ఆదర్శాల ప్రకటనగా మాత్రమే మిగిలి వుంటాయని చరిత్ర రుజువు పర్చింది.

వ్యక్తుల హక్కులకు హామీ కల్పించడంలో సోషలిజం గుణాత్మకంగా ఒక కొత్త దశ. ఆ రంగంలో సోవియట్ ఎన్నో విజయాలు సాధించింది. అయితే సామాజిక భాగస్వామ్య భావన, చైతన్యంలో పాదుకొనలేదు. సోవియట్ ప్రజల జీవన ప్రమాణాలను మెరుగు పర్చే కృషిని క్రమబద్ధమయిన రాజ్యాంగ బాధ్యతల అమలులో విజయంగాగాక నాయకత్వపు సత్సంకల్పం, "పితృప్రేమ" ఫలితంగా వచ్చినట్టు పరిగణించడమూ (అలా చిత్రించడమూ) జరుగుతోంది "ఈ

## ప్రజాస్వామ్యీ
## క్రమంలో

దేశంలో ఎవరినీ వస్తులతో చావనియ్యబోము" అన్న ఫార్ములా భావన కూడా విస్తృతంగా వ్యాపించింది. సామాజిక క్రమంలో ప్రతి ఒక్కరూ పాల్గొనాలనే, ప్రతి వ్యక్తీ బాధ్యత స్వీకరించాలనే భావన చైతన్యంలో దృఢంగా వేరూనాలి.

మానవ హక్కుల రక్షణకున్యా య యంత్రాంగం పూర్తి స్థాయిలో పని చేస్తే తప్ప సామాజిక వ్యవస్థ సక్రమంగా విధులను నెరవేర్చ జాలదు. ప్రజల హక్కులకు భంగం కల్గించే అధికార్ల చట్ట విరుద్ధ చర్యలను న్యాయస్థానాలలో సవాలు చేసేందుకు వుద్దేశించిన చట్టం అలాటి యంత్రాంగానికి యీ రోజు ప్రాతిపదిక నిస్తున్నది. సోవియట్ రాజ్యాంగంలో **50**వ ప్రకరణానికి అనుకూలంగా యీ చట్టాన్ని రూపొందించారు. **1988**జనవరి **1** నుంచి అది అమలులోకి వచ్చింది. అధికార్ల చట్ట విరుద్ధ చర్యలవల్ల జరిగిన నష్టాలకు పరిహారం చెల్లించే పద్ధతిని గురించిన చట్టం **1981** నుంచి అమలులో వుంది. యివి ప్రస్తుత దశలో యీ న్యాయ యంత్రాంగానికి చక్కని ప్రాతిపదిక కాగలవు:

అయితే యిది ప్రారంభం మాత్రమే. సోషలిస్టు శాసనాల ద్వారా పాలించే రాజ్యం, వ్యక్తి హక్కుల పరిరక్షణకు ప్రాధాన్యత నిచ్చే రాజ్యం అనే భావన అమలు కోసం చట్టాల్ని మెరుగు పర్చే క్రమం ఏకరీతిగా సాగాలి. అదే సామాజిక న్యాయం సమకూర్చే పంథా. ''పునర్నిర్మాణం, ప్రజాస్వామ్య విస్తరణ, సోషలిజం విలువల పటిష్టీకరణ విధానాన్ని మనం అమలు పరుస్తున్నామంటే అది ఎవరినో సంతోషపెట్టడం కోసం ఎంతమాత్రమూ కాదు. మన సమాజం పునర్నిర్మాణం, ప్రజాస్వామ్యాల గుండా సామాజిక ఆర్థిక సాంస్కృతిక అభివృద్ధి క్రమంలో నూతన శిఖరాలకు చేరుకోవాలన్న లక్ష్యంతో ఆ విధానాన్ని అమలు పరుస్తున్నాం.'' అని **1987**జూన్‌లో పార్టీ కేంద్ర కమిటీ ప్లీనరీ సమావేశంలొ మిహాయిల్ గొర్బచేవ్ చెప్పారు. మన పురోగతిని నిరోధిస్తున్న అవరోధాలను తొలగించుకునేందుకు మనకు యిప్పుడు వాస్తవావకాశం లభించింది.

-(నెదెల్యా పత్రిక నుంచి సంక్షిప్తం)



# మానవ హక్కుల సమస్యల పట్ల నూతన వైఖరి



మానవ హక్కులు, మానవీయ సహకార విషయాల నూతన ప్రజా సంస్థను గురించి ప్రముఖ సోవియట్ న్యాయ శాస్త్రవేత్త, పండితుడు అయిన ఫ్యోదర్ బుర్లా త్స్కీ యిచ్చిన యింటర్వ్యూను యిక్కడ పొందు పరుస్తున్నాం. యీ సంస్థకు యీయన అధిపతి.

మానవ హక్కుల రంగంలో, మానవీయ కార్యక్రమాల్లో అంతర్జాతీయ సహకారం నానాటికి ప్రాధాన్యతను సంతరించుకుంటోంది. నిరాయుధీకరణ క్రమం అభివృద్ధి చెందుతున్న పరిస్థితుల్లో దీనికి ప్రేరణ లభించింది. యిటీవలే యేర్పాటైన మానవ హక్కుల, మానవీయ సహకార విషయాల ప్రజా సంస్థ సహకార ప్రాజెక్టుల గురించి చర్చిస్తోంది. యీ సంస్థ కృషి యీ దేశంలో, విదేశాల్లో యెంతో ఆసక్తిని రేకెత్తించింది.

యూరోపియన్ భద్రత, సహకారం తాలూకా సోవియట్ కమిటీ ఆధ్వర్యాన యీ సంస్థను యేర్పాటుచేయడం జరిగింది

ప్ర: సంస్థ పుట్టుపూర్వోత్తరాల గురించి చెపుతారా?

జ. ఈ సంస్థ చాలాకాలం క్రితమే యేర్పాటు చేయాల్సి వుండింది. 1975 హెల్సింకీ ఒప్పందం తుదిచట్టం యీ రంగంలో కూడా సోవియట్ ప్రభుత్వ కార్యకలాపాలను నిర్దేశించింది.

మన సంస్థ శాస్త్రజ్ఞుల, సాంస్కృతిక కార్యకర్తల బృందం చొరవతో యేర్పాటు అయింది. యిందులో రచయితలు గియోర్గి బక్లానవ్, అలెస్

అదమోవిచ్, అకడమీషియన్ బోరిస్ రాషెన్‌బాక్, న్యాయ శాస్త్రవేత్త ఎతాలీ ఇగ్నాటెంకో, నేను వున్నాం. యీ సంస్థ బురాక్రటిక్ సంస్థకాదు. చేతనం తీసుకోకుండా వుత్సాహంతో పనిచేసేవారిని యిది ఐక్యం చేస్తుంది. యిందులోని సభ్యులు యిలాంటి విదేశీ సంస్థల్లోని సభ్యులతో సన్నిహితసంబంధాలు కొనసాగిస్తున్నారు. వీటిని మేము యిప్పుడు సంయుక్తంగా నిర్వహించదలచాం. యిందులో 30 మంది సభ్యులున్నారు.

ఇక మౌలక్ష్యాల గురించి, అంతర్జాతీయ సహకారంపట్ల నూతన వైఖరిని పెంపొందించడం మౌలక్ష్యం.

హెల్సింకీ తుదిచట్టం ఆమోదం తర్వాత చాలా కాలంవరకూ మానవీయ, మానవ హక్కుల సమస్యలు సహకార రంగంగా కాక వివాదాంశంగా వుండినాయి. స్తబ్దతా కాలంలో తలెత్తిన కారణాలే యిందుకు మూలం. వీటిని యిటీవలే బహిర్గతం చేయడం జరిగింది. యీ అంశంపై జరిగిన చర్చలను, రాజకీయ, మానసిక వాతావరణాన్ని విషమింపజేయడానికి ప్రాక్పశ్చిమ సంబంధాలను బలహీన పర్చడానికి, ఆయుధపోటీని నిలువరించే, నిరాయుధీకరణను సాధించే తక్షణ సమస్యలపై సంప్రతింపులను నీరుగార్చడానికి వినియోగించారు.

నూతన ఆలోచన విధానానికి అనుగుణ మైన నూతన ధోరణిని మా సంస్థ పెంపొందించదలచింది.

పరిస్థితులను చక్కబెట్టడానికి ప్రాక్పశ్చిమ దేశాలు తమ కృషిని కలబోసుకోవాలి. యితరులపై నిందలు మోపకుండా, యితరుల లోపాలను వెదకడానికి ప్రయత్నించకుండా యీ సమస్యలను మనం ప్రశాంతంగా చర్చించాలి.

ప్రతి ఒక్క దేశం మానవహక్కులను అమలు వర్చాలని హెల్సింకీలో ప్రకటించిన చాలా సరళమైన విషయాన్ని దృష్టిలో పెట్టుకొని మేము ముందుకు సాగుతున్నాం. యిది ఆయాదేశాల్లోని అనేక పరిస్థితులపై ఆధారపడి వుంటుంది. యెవరి సమస్యలను వారు ఏకాంతంగా ఆలోచించాలని దీనర్థంకాదు. మనకు సహకారం,

**హెల్సింకీ తుదిచట్టం ఆమోదం తర్వాత చాలా కాలంవరకూ మానవీయ, మానవ హక్కుల సమస్యలు సహకార రంగంగా కాక వివాదాంశంగా వుండినాయి. స్తబ్దతా కాలంలో తలెత్తిన కారణాలే యిందుకు మూలం. వీటిని యిటీవలే బహిర్గతం చేయడం జరిగింది. యీ అంశంపై జరిగిన చర్చలను, రాజకీయ, మానసిక వాతావరణాన్ని విషమింపజేయడానికి ప్రాక్పశ్చిమ సంబంధాలను బలహీన పర్చడానికి, అయుధపోటీని నిలువరించే, నిరాయుధీకరణను సాధించే తక్షణ సమస్యలపై సంప్రతింపులను నీరుగార్చడానికి వినియోగించారు.**

●

**పరిస్థితులను చక్కబెట్టడానికి ప్రాక్పశ్చిమ దేశాలు తమ కృషిని కలబోసుకోవాలి. యితరులపై నిందలు మోపకుండా, యితరుల లోపాలను వెతకడానికి ప్రయత్నించకుండా యీ సమస్యలను మనం ప్రశాంతంగా చర్చించాలి.**

●

**ముఖ్యంగా వివిధ సామాజిక సంస్థల అనుభవాన్ని, వాటి విజయాలు, లోపాలు, సమస్యలతోసహా అన్నిటినీ ప్రశాంతంగా విశ్లేషించాలి.**

●

**అందువల్ల మనకు ఒక సమాచార వ్యవస్థ అవసరం. దాన్ని సోషలిస్టు, పెట్టుబడిదారీ దేశాల సహకారంతో యేర్పాటు చేయవచ్చు.**

●

**బాహటత ప్రజాస్వామ్యీకరణ పరిస్థితుల్లో మానవహక్కుల సమస్యలపై నూతన వైఖరికి సంబంధించిన చర్చ, చట్టబద్ధత - వీటిపై ప్రజా అభిప్రాయాన్ని నెరపడం మా పరిధిలోని అంశం.**

## మానవ హక్కుల సమస్యల పట్ల నూతన వైఖరి

అనుభవాల ఆదాన ప్రధానం అవసరం ఐ.రా.స. పత్రాల్లో నమోదైన అంతర్జాతీయ చట్టనియమా లన్నిటిని ఏకరీతిగా అమలువరచాలి:

ముఖ్యంగా వివిధ సామాజిక సంస్థల అనుభవాన్ని, వాటి విజయాలు, లోపాలు, సమస్యలతోనహా అన్నిటినీ ప్రశాంతంగా విశ్లేషించాలి.

యీ నాడు మన దేశం, సామాజిక పరివర్తనల క్రమంగుండా సాగుతోంది. దాన్ని పెరిస్త్రోయికా అంటున్నాం. యిది ప్రజాస్వామ్యాన్ని బాహాటతను పెంపొందిస్తోంది. అంతర్జాతీయ నహకారం మా కృషిలోని ప్రధాన అంశం., అన్ని రంగాల్లో అంతర్జాతీయ నహకారం లేనిదే యేదేశమూ అభివృద్ధి చెందదు.

అందువల్ల మనకు ఒక సమాచార వ్యవస్థ అవసరం. దాన్ని సోషలిస్టు, పెట్టుబడిదారీ దేశాల సహకారంతో యేర్పాటు చేయవచ్చు.

మానవహక్కుల నమన్యల పట్ల యీదేశంలో, పాశ్చాత్య దేశాల్లో గల దృక్పథంలోని తీవ్ర విభేదాలు అందరికీ తెలును. ముఖ్యంగా ఆర్థిక రంగంలో స్వేచ్ఛకు సంబంధించిన సూత్రాన్ని పాశ్చాత్య దేశాలు నొక్కిచెపుతున్నాయి. పెట్టుబడిదారీ వ్యవస్థ అవసరాన్ని ప్రధానంగా ప్రతిబింబించే యీ సూత్రం తోటి మానవుణ్ణి దోచుకోవడానికి దారి తీస్తుంది. మన వ్యవస్థ సమానతను నొక్కి చెపుతున్నది. వీటిని సోషలిస్టు సూత్రాలు విశదీకరిస్తున్నాయి. వీటిని మానవహక్కులకు విరుద్ధంగా అప్పుడప్పుడు వక్రీకరించిన ఘటనలున్నాయి. 1930లలో మానవ హక్కులను ఘోరంగా వుల్లంఘించిన సందర్భాలను చూడడానికి నిరాకరించే హక్కుమనకు లేదు.

### ప్ర: మీ సంస్థ పట్ల విదేశాల్లోగల అభిప్రాయాన్ని చెపుతారా?

జ: ఈ సంస్థ .యేర్పాటు విదేశాల్లో ఆసక్తిని రేకెత్తించింది. వాషింగ్టన్ శిఖరాగ్ర సమావేశం సందర్భంగా దీన్ని నేను గమనించాను. అమెరికాలోని అనేక ప్రజా సంస్థల ప్రతినిధులను మేము కలుసుకొన్నాం. వాటితో సంబంధాలు యేర్పరచుకొన్నాం. సహకార అవకాశాల గురించి చర్చించాం.

### ప్ర: సహకారానికి వీలున్న రంగాలేమిటో చెపుతారా?

జ: అవి విజ్ఞాన శాస్త్రం, ముఖ్యంగా మానవీయ శాస్త్రాలు, విద్య, సంస్కృతి, మానవ హక్కుల రంగంలో నహకారం.

### ప్ర: ఈ దేశంలో మీరేమి చేస్తారు? యిది మా పాఠకులడిగే చాలా ఆసక్తికరమైన ప్రశ్న.

జ. మనకు గల అవకాశాలను ఆసాంతం మనం బేరీజు వేసుకోవాల్సి వుంది. మనది ప్రభుత్వ సంస్థకాదు. బాహాటత ప్రజాస్వామ్యీకరణ పరిస్థితుల్లో మానవహక్కుల సమస్యలపై నూతన వైఖరికి సంబంధించిన చర్చ, చట్టబద్ధత - వీటిపై ప్రజాభిప్రాయాన్ని నెరపడం మా పరిధిలోని అంశం.

### ప్ర: ప్రజల లేఖలకు, ఫిర్యాదులకు డిమాండ్లకు మీరు యే విధంగా ప్రతిస్పందిస్తున్నారు?

జ: ఆర్థిక హక్కులను, పౌరహక్కులను వుల్లంఘిస్తున్నారని, వుద్యోగం నుంచి తొలగించారని, కొత్త యింటి వాటా యివ్వలేదని, వలన వెళ్లడానికి అనుమతివ్వలేదని, డిటెన్షన్‌లో వున్నప్పుడు సరిగా చూడడంలేదని యిలాంటి లేఖలు వస్తున్నాయి.

మన శాసనాలను మెరుగువర్చే నమన్యలను మేము లేవనెత్తుతాం. పత్రికలకు నంబంధించిన శాసనాన్ని తయారుచేయడం లాంటి కొన్ని సమస్యలను మొదటి కొన్ని నమావేశాల్లో చర్చించాం. సోవియట్ సంఘంలో మత పీఠానికి గలస్థానంపై 1920లలో ఆమోదించిన శాసనాన్ని తిరిగి పరిశీలించాలని మా సంఘంలో సభ్యులుగా వున్న మతాచార్యులు అంటున్నారు.

ప్రభుత్వ న్యాయ సంస్థలతో రౌండ్‌టేబుల్ సమావేశానికి సన్నాహాలు చేస్తున్నాం. శాసనాన్ని మెరుగువర్చే సమస్యలపై మేము అభిప్రాయాలను పరస్పరం తెలియజేసుకుంటాం. ప్రబోధాత్మక కృషి, వివిధ వేదికలపై చర్చలు, సంభాషణలు వగైరా మా కార్యక్రమంలో వున్నాయి.

(సవిత్‌స్కయా రొస్సియా నుండి, సంక్షిప్తం)

మానవ హక్కులపై సోవియట్, అమెరికన్ పార్లమెంటేరియన్ల మధ్య జరిగిన టెలివిజన్ చర్చను 1987లో [illegible] మంది టెలివిజన్ ప్రేక్షకులు విన్నారు ఆరోగ్యవంతులైన, అయితే 'రాజకీయంగా అవాంఛనీయమైన' వారిని సోవియట్ యూనియన్‌లో పిచ్చాసుపత్రులకు పంపుతున్నారనే వివాదాన్ని మళ్లీ ఆ చర్చ సందర్భంగా అమెరికన్లు లేవదీశారు. అమెరికాకు వలసవెళ్లిన ఒక వ్యక్తి చేసిన ప్రకటనను అమెరికన్లు ఉదహరించారు. [illegible] తనను రోగి అనీ, అమెరికన్ నిపుణులు రోగేమీ కాదనీ చెప్ [illegible]. ఎవరు చెప్పింది నిజం?

# మానసిక ఆరోగ్య రక్షణ చట్టం

## ఆవశ్యకత

అనతొలి పొతపవ్‌తో యింటర్వ్యూ సంక్షిప్త పాఠాన్ని యిస్తున్నాం. ఆయన రష్యన్ ఫెడరేషన్‌లో ఆరోగ్య సంరక్షణ మంత్రిత్వ శాఖకు అనుబంధించిన సోవియట్ వైద్య సర్వీసుల అకాడెమీలో కరెస్పాండింగ్ సభ్యులు. మానసిక వ్యాధుల చికిత్సలో నిపుణుడు. సైబీరియా నగరం తోమ్స్క్‌లోని మానసిక వ్యాధుల ఆస్పత్రికి పదేళ్లపాటు అధిపతిగా వున్నారు. యిది సోవియట్ యూనియన్‌లోని యిలాటి పెద్ద సంస్థలలో ఒకటి.

**ప్ర : భిన్నాభిప్రాయం ప్రకటించినందుకు ఆరోగ్యంగా వున్నవారిని కూడ సోవియట్ యూనియన్‌లో మానసిక చికిత్సా కేంద్రాలకు నిర్బంధంగా పంపుతున్నట్టు పాశ్చాత్య దేశాల పత్రికలు తరచు నిందిస్తుంటాయి. ఇది నిజమంటారా?**

జ: విచిత్రమేమిటంటే, మానసిక రోగాల విషయంలో తీర్పు చెప్పడానికి అందరూ సిద్ధమై పోతూంటారు. ఇతర వ్యాధుల విషయంలో అలా చెయ్యరు. ఉదాహరణకు ఒక వ్యక్తికి క్యాన్సరు రోగం వున్నదీ, లేనిదీ ఆ వ్యాధి నిపుణుడే చెప్పాలని అందరూ ఒప్పుకుంటారు. కాని మానసిక వ్యాధి విషయంలో తాము సులభంగా కనిపెట్ట గలమని అనుకుంటారు.

సోక్రటీసు ఎప్పుడో చెప్పినట్టు "ఎవరైనా ఒక వ్యక్తి తాను నగర ద్వారం వచ్చినపుడు తల వంచుకు వెళ్లాల్సినంత పొడుగ్గా వున్నాననీ, యిళ్లను ఎత్తేంత బలమైన వాణ్ణినీ అనుకుంటే అందరూ అతణ్ణి పిచ్చివాడంటారు. పూర్తిగా అర్థరహితమయిన పద్ధతిలో ప్రవర్తించినపుడే మానసిక అనారోగ్యం అంటారు." కాని సాధారణంగా మానసిక వ్యాధులు యింత తీవ్రంగా బయట పడిపోయేటట్టు వుండవు. అవి రోజువారీ అనుభవాలలో బాధాకరంగా వ్యక్తమవుతాయి. ఉదాహరణకు ఈర్ష్యతో వచ్చే వున్మాద భ్రమ. మనకు సాధారణంగా ఎదురుపడే ఘటనలకు మానసికంగా ఆరోగ్యంగా వున్నవారు, మానసిక రోగులు ప్రతిస్పందిస్తారు; దీన్ని మామూలు మనుషులు గ్రహించడం కష్టం. సకాలంలో రోగికి చికిత్స చేయకపోతే అవి మరింత ప్రస్ఫుటంగా బయటపడతాయి. వున్మాదం తారాస్థాయికి పెరుగుతుంది.

మానసిక వైద్య శాస్త్రంలో ఒక సామెత వుంది. "వున్మాదం పట్టిన ఒక వ్యక్తిని మానసికంగా ఆరోగ్యంగా వున్నవారు వేలమందైనా మార్చలేరు. అయితే మానసికరోగం వున్న ఒకే వ్యక్తి మానసికంగా ఆరోగ్యంగా వున్న వేలమంది మనుషులను మార్చగలడు. వారిపై ప్రభావం కలిగించగలడు." "మానసిక వైద్యుల నుంచి తమను రక్షించాల్సిందిగా" ఆ రోగులు అందరికీ విజ్ఞప్తులు చేస్తుంటారు. వాటికి సాధా రణంగా అందరి నుంచి తోడ్పాటు ప్రతిస్పందన వస్తుండటం విచారకరం. దానివల్ల మానసిక వైద్యంపై అపనమ్మకం ఏర్పడటం, రోగికి అవసర మైన చికిత్స కష్టమవడం జరుగుతుంది.

నా అనుభవం చెబుతాను. తొమ్‌స్క్‌లో ఒక మానసిక రోగుల ఆస్పత్రిలో అనేక సంవత్సరాలు పనిచేశాను. అక్కడ 3వేల మంది రోగులకి ఏకకాలంలో చికిత్స చేస్తారు. ఆరోగ్యంగా వున్నవారిని అక్కడ పెట్టి బాధించిన ఘటన ఒక్కటీ నా దృష్టికి రాలేదు. అయితే కొందరు రోగులు మట్టుకు తాము భిన్నాభిప్రాయం ప్రకటించిన కారణం చేతనే ఈ ఆస్పత్రిలో తమను వుంచినట్టు భ్రమించడంకద్దు. అయితే రోగం హటాత్తుగా విషమించినపుడు వారు వూహించని రీతిలో తమకూ, యితరులకూ ప్రమాదం కలిగేలా ప్రవర్తిస్తారు. వారికి చికిత్స చేయడమూ, వారివల్ల సమాజానికి నష్టం కలగకుండా రక్షించడమూ వైద్యులుగా మా విధి. యిది ఎంతో కష్టమయిన, ప్రమాదకరమయిన బాధ్యత. ఎందరో వైద్యులు, నర్సులు తమ విధులు నిర్వహిస్తుండగా పిచ్చివాళ్ల చేతిలో మరణించారు.

సైద్ధాంతిక పోరాటంలో మానసిక రోగ చికిత్సను కేంద్రం చేసి యిలా ఆధార రహితంగా మాట్లాడటానికి అసలు సోవియట్‌లోని మానసిక చికిత్స శాస్త్ర స్థితిగతులే కొంత వరకు కారణమనాలి. అభివృద్ధిలో స్తబ్దత ఏర్పడిన కాలంలో యీ రంగం చాలా బలహీనమై పోయింది. మానసిక రోగాలు, మాదక ద్రవ్య సేవన మొదలైన వాటిని గురించి ప్రస్తావించడమే సిగ్గుగా భావించేవారం. బాహాటత, విమర్శ ప్రజా అజమాయిషీ లేనపుడు బాధ్యతా రాహిత్యం, వ్యష్టివాదం పెరుగుతాయి. మరొక కారణం, మానసిక వైద్య సర్వీసుల ఆర్గనైజేషన్‌లోనే స్తబ్దత ఏర్పడింది. ఇప్పటికీ ఆస్పత్రిలోనే చికిత్స చేయడంపట్ల మొగ్గు చూపుతున్నారు. జబ్బు నయమైపోయిన వారిని కూడా అవసరం లేకపోయినా ఔట్ పేషెంట్ క్లినిక్‌ల అబ్జర్వేషన్‌లో పెడుతున్నారు.

సోవియట్‌లోని మానసిక వైద్యులు పాటించేందుకు ఒకే చికిత్సా పద్ధతిని రూపొందించాలని కొందరు ప్రవీణులు చేసిన



ప్రయత్నాల వల్ల యీ విజ్ఞాన శాస్త్ర అభివృద్ధి ఏకముఖంగా తప్ప బహుముఖాలుగా జరగలేదు. అనేక సంవత్సరాలపాటు కేవలం స్కిజోఫ్రెనియా (భ్రమలు, నిరాసక్తత వల్ల బుద్ధి, మేధస్సు మంద గించడం) పైనే శ్రద్ధ కేంద్రీకరించారు. దీనివల్ల తాగుడు, మాదక ద్రవ్య సేవనం, నరాల వ్యాధులు వంటి వాటిని గురించి పరిశోధనకు నష్టం జరిగింది. అయితే అమెరికాలో కూడా స్కిజోఫ్రెని యా పై కేంద్రీకరించి విస్తృతంగా పరిశోధనలు చేస్తున్నారు. 50వ పడిలో పడ్డవారిని "దరిదాపు స్కిజోఫ్రెనియా" లుగా రోగ నిర్ణయం చేయడం జరుగుతున్నది. అంటే వారిని "మానసిక రోగం వల్ల సమాజ వ్యతిరేక కార్య కలాపాలకు పాల్పడే" వారుగా పరిగణించడం జరుగుతున్నది.

**ప్ర: 1987లో మానవ హక్కుల్ని గురించి సోవియట్ అమెరికా పార్లమెంటేరియన్ల మధ్య టెలివిజన్ చర్చను కోట్లాది మంది సోవియట్ పౌరులూ, యితర దేశస్థులూ చూశారు. మానసి కంగా ఆరోగ్యంగా వున్నా "రాజకీయంగా అభ్యంత రంగల" వారిని మానసిక ఆస్పత్రులలో నిర్బంధంగా చేర్పిస్తున్నారనే ంచే విషయం చర్చకు వచ్చింది. సోవియట్ నుంచి వలస పోయిన ఒక వ్యక్తి చేసిన ప్రకటన టేపును అమెరికా పక్షంవారు తమ వాదనకు మద్దతుగా వినిపించారు. తాను సోవియట్‌లో వుండగా ఆస్పత్రిలో వుంచడం అవస రమని సోవియట్ నిపుణులు భావించారనీ అయితే తాను అమెరికా వెళ్లగా అక్కడ నిపుణులు తాను పూర్తిగా ఆరోగ్యంగా వున్నట్లు కనుగొన్నారని ఆ వ్యక్తి ఆ ప్రకటనలో చెప్పారు. ఇజ్వెస్తియా ప్రచురించిన ఒక వ్యాసం కూడా దీనికి బాగా బలం చేకూర్చింది. మానసిక వైద్యులు నిరంకు శంగా ప్రవర్తిస్తున్నారనీ, వారు తలిస్తే ఎవర్నయినా పిచ్చి ఆస్పత్రులకు పంపగలుగుతారనీ యీ విషయంలో ఎవరికీ రక్షణ లేదనీ ఆ పత్రిక రాసింది. యింతకీ లోపం ఎక్కడ? రోగ నిర్ణయంలో పొరబాట్లా? లేక వీరి అధికార దుర్వినియోగం ఒక వ్యవస్థగా రూపుదిద్దుకున్నదా?**

జ: పొరబాట్లు జరగవచ్చు. అయితే ఒకటో రెండో కేసులను ఆధారం చేసుకుని మొత్తం పరిస్థితి అలాగే వుందని చెప్పడం సరికాదు. మానసిక రోగ చికిత్సలకు దీన్ని వర్తింప జేస్తే ఆ శాఖ వైద్యుల పని మరింత సంక్లిష్టమవుతుంది పొర పాట్లు వుల్లంఘనలు అన్ని చోట్లా జరుగుతుంటాయి. టెలి సమావేశంలో ప్రస్తావించిన విషయం నేనిలా వివరిస్తాను. యిప్పుడు మానసిక రోగ నిర్ధారణ చాలా సంక్లిష్ట స్థాయికి పెరిగింది. ఒక మానసిక వైద్యుడు రోగిని చికిత్సకు ముందు పరీక్షించి వుండవచ్చు. మరో వైద్యుడు చికిత్స జరుగుతున్న వివిధ దశల్లోనో మరొకరు చికిత్స పూర్తయాక రోగి పూర్తిగా కోలుకున్నాకనో పరీక్షించి వుండవచ్చు. యిలాటి వారిని తమకు సాక్ష్యాలుగా వారు చూపి స్తూండవచ్చు. సోవియట్‌లో అయితే పిచ్చాసుప త్రులలో పెడతారనీ, పాశ్చాత్య దేశాలలో స్వేచ్ఛగా వుండవచ్చునే అభిప్రాయం కలిగించేందుకు అలా చేస్తుంటారు. అయితే కొందరు మానసిక రోగులు పాశ్చాత్య దేశాలకు వెళ్లాక రోగం తిరగ బెట్టడంతో వారిని అక్కడి పిచ్చాసుపత్రులలో చేర్చిన విషయాలు మాత్రం ఏ కారణంవల్లో ప్రపంచం దృష్టికి తేవడం లేదు. అయితే మానసిక వైద్యులకు ఆ ఘటనల గురించి తెలుసు

**ప్ర: ముఖ్యంగా రోగులను ఆస్పత్రులలో**

**నిర్బంధంగా చేర్పించడంలో పొరపాట్లు జరగ కుండా చూడాలంటే ఎలాటి చర్యలు తీసుకోవా లంటారు?**

జ :ఎమర్జెన్సీగా ఆస్పత్రులలో చేర్చడంతో సహా మానసిక రోగుల చికిత్స పద్ధతులను స్పష్టంగా నిర్వచించడం అవసరం ఉదాహరణకు తల తోకా లేని ఫిర్యాదులతో చుట్టు పక్కల వారికి చికాకు కలిగించే రోగిని ఆస్పత్రులలో నిర్బంధంగా చేర్చాలని ఒక వైద్యుడు భావించవచ్చు. ఆ వ్యక్తి ప్రవర్తన పని ప్రదేశంలో యిబ్బందులు కలిగిస్తు న్నప్పటికీ ఎమర్జెన్సీ ప్రాతిపదికగా దానిని పరిగ ణించనక్కర లేదు. అలాటి సందర్భాలలో అతడి సహ వుద్యోగులు ప్రాసిక్యూటర్ కార్యాలయానికి, కోర్టుకు వెళ్లడానికి అవకాశం వుండాలి. కోర్టు తీర్పు నిపుణుల అభిప్రాయం ప్రాతిపదికగా ఆ వ్యక్తిని నిర్బంధంగా ఆస్పత్రులో పెట్టవచ్చు. అలాగే ఆ వైద్యుని అర్హత గురించి సవాలు చేస్తూ వున్నత స్థాయి నిపుణులకు ఫిర్యాదు చేయడానికి యిప్పు డున్న అవకాశంతో బాటు కోర్టుకు వెళ్లడానికి గూడా హక్కువుండాలి.

అయితే మానసిక వైద్యుల నిపుణతలను ఎప్పటి కప్పుడు పెంచడం అవసరం. తగినంత నిపుణత లేనప్పుడు వైద్యుడు అతి జాగ్రత్తకు పోయి రోగిని నిర్బంధంగా ఆస్పత్రిలో చేర్పించే ప్రమాదముంటుంది. ఈ వైద్యుల నిపుణతలను పెంచే సౌకర్యాలు తగు విధంగా లేవు. ఆయా శాఖలను మానసిక రోగాల పరిశోధనా సంస్థకు అనుసంధించడం అవసరం. కనీసం అయిదేళ్ల కోసారి యిలాటి సర్టిఫైయింగ్ పరీక్షలకు వారు హాజరు కావడం అవసరం. చిన్న మానసిక రుగ్మతల చికిత్సకు యిప్పుడు పగటి పూట రాత్రి పూట పనిచేసే చికిత్సా కేంద్రాలున్నాయి. రోగి పగటిపూట కొద్ది గంటలు ఆస్పత్రిలో వుండి సాయంత్రం కుటుంబాలతో గడపడానికి వీలుంటుంది. ఉద్యోగాలకు, చదువులకు భంగం కలగకుండా రాత్రిపూట వైద్య కేంద్రాలలో చికిత్స పొందవచ్చు. నయమైన రోగులకు వుపాధి కల్పించే కృషి బాగా మెరుగవుతున్నది. ఔట్ పేషంట్ కేంద్రాలపై శ్రద్ధతోబాటు ఆస్పత్రుల స్థితిగతులుకూడా పెంచాలి. వుదాహరణకు లెనిన్ గ్రాడ్‌లో యుద్ధానంతరం ఒక్క మానసిక ఆస్పత్రి కూడా నెలకొల్పలేదు. విప్లవానికి ముందు పదివేల జనాభాకు 25 పడకల చొప్పున వుండగా యిప్పు డది 18 కి తగ్గింది. అందువల్ల ఆస్పత్రులు రోగులతో కిక్కిరిసి పోతున్నాయి. మానసిక రోగు లకు చికిత్సలో సమస్యలకు బాధ్యత మొత్తంగా వైద్యుల మీదే మోపడం సరికాదు. మానసిక రోగుల పట్ల ప్రత్యేక శ్రద్ధ వుండాలి. మొత్తం సమాజం దీన్ని గ్రహించి యీ కృషిలో నిమగ్నం కావాలి. అందుకు మానసిక ఆరోగ్య పరిరక్షణ పై ఒక కొత్త చట్టం అవసరం. అలాటి చట్టం ముసాయిదాను రూపొందించడం జరుగుతోంది.

సోవియట్ యూనియన్‌లో జరుగుతున్న ప్రజాస్వామ్యీకరణక్రమం దేశంలోని మత పరిస్థితిపై కూడా ప్రభావం నెరపుతోంది. 1985ఏప్రిల్ తరువాతదేశంలో విభిన్న మతాలకు చెందిన 173 కొత్త అసోషియేషన్‌లు రిజిష్టరయాయి. అదే సమయంలో 107మత సంస్థలను వాటి నిర్వహణ సంతృప్తికరంగా లేనందున రిజిస్ట్రేషన్ నుంచి తొలగించడం జరిగింది. భక్తుల అవసరాలను తీర్చడానికి యిప్పుడు చర్చికి విస్తృతావకాశాలున్నాయి.

కన్‌స్తన్‌తీన్ కర్చేవ్
సోవియట్ యూనియన్ మంత్రి మండలిలో మత వ్యవహారాల కమిటీ చైర్మన్

వేలమంది యిప్పుడు దేశంలో మతబోధకులుగా ఉన్నారు

మిలియన్ల రూబుళ్లు, వివిధ మతపీఠాల వార్షిక ఆదాయం.



# సోవియట్ రాజ్యమూ మతపీఠము



ఉక్రెయిన్‌లోని ల్వోవ్‌లో. సెయింట్ యూరా కెథడ్రల్‌లో వుదయపు ప్రార్థనలకు వెళ్లుతున్నారు.
మాస్కో సమీపంలోని పెరెదెల్కిలో ఈస్టర్ ప్రార్థనలు.



అక్టోబరు విప్లవం తర్వాత తొలిరోజుల్లో దేశంలో అసాధారణ పరిస్థితి యేర్పడింది. సామాన్య ప్రజానీకంలోని ఆస్తికుల్లో అత్యధికులు సోవియట్ ప్రభుత్వ స్థాపనలో, ఆ తర్వాత దాని రక్షణలో పాల్గొన్నారు. భూముల, ఫ్యాక్టరీల, కర్మాగారాల, జాతీయం, శాంతిడిక్రీ- యివి యెవరి కోసం తీసుకున్న చర్యలో వారు అర్థంచేసుకొన్నారు. కాగా మత బోధకుల్లో, మత పీఠాధిపతుల్లో చాలా మంది విప్లవ ప్రతీఘాతకుల శిబిరంలో చేరిపోయారు.

రాజ్యానికి మత పీఠానికి మధ్య సంబంధాలను మామూలు స్థాయికి తీసుకురావడంలో సోవియట్ ప్రభుత్వంచేసిన సముచిత నిర్ణయాలు నిర్ణయాత్మక పాత్ర వహించాయి. రాజ్య వ్యవస్థ నుండి మతపీఠాన్ని మతపీఠం నుండి పాఠశాలను వేరు చేసే డిక్రీపై 1918 ప్రారంభంలో లెనిన్ సంతకం చేశారు. యీ విధంగా మత పీఠం ప్రభుత్వం సంస్థాప్రతిపత్తిని కోల్పోయింది. భక్తుల అవసరాలను సంతృప్తిని కోల్పోయింది. భక్తుల అవసరాలను సంతృప్తి పరచడానికి కేంద్రీకరించి పనిచేసే వాస్తవ అవకాశం దానికి లభించిది.

తరుణ సోవియట్ రాజ్యం అప్పుడు కష్టకాలాల్లో వుంది: అవి ఆకలిబాధ, వ్యాధులు, అంతర్యుద్ధం విదేశీ జోక్యం వల్ల అస్త వ్యస్థ పరిస్థితి. సామాజిక సమస్యలను పరిష్కరించడానికి అనేక మత సంస్థలు కూడా రంగంలోకి దిగాయి. ఆకలితో అలమటిస్తున్న వారిని ఆదుకున్నాయి. రోగులకు సేవలు చేశాయి.

రాజ్య వ్యవస్థకూ మత పీఠానికి మధ్య సంబంధాలను విశదీకరించిన లెనినిస్టు నియమాలు మత విశ్వాసాల కారణంగా అణచివేతలకు ఆస్కారం లేకుండా చేశాయి. ప్రజా ప్రభుత్వానికి వ్యతిరేకంగా అవి వ్యవహరించినపుడు జాతీయ ప్రయోజనాల రక్షణకోసం తీసుకొన్న చర్యలున్నాయి. కాని అసాధారణ పరిస్థితుల వల్ల విధించిన ఆంక్షల, నిషేధాల అవసరం తీరిపోయినప్పటికీ యెన్నో ఆంక్షలను, నిషేధాలను అలాగే కొనసాగించడం జరిగింది.

ప్రజలు మతాన్ని వదులుకునే క్రమాన్ని ముమ్మరంచేయాలనే తలంపుతో ఆస్తికుల హక్కులపై చట్ట వ్యతిరేకమైన ఆంక్షలు విధించడం దురదృష్టకరమైన విషయం. ఉదాహరణకు ఆస్తికులు కష్టించి పనిచేసినందుకు పూర్తిస్థాయి

# మతసంస్థల సంఖ్య

| మతాలు | | | | | | |
|---|---|---|---|---|---|---|
| రష్యన్ ఆర్థోడాక్స్ | 11,742 | 7523 | 7274 | 7038 | 7007 | 6794 |
| కెథలిక్ | 1179 | 1116 | 1087 | 1070 | 1102 | 1099 |
| ఇస్లాం | 2307 | 1820 | 1087 | 1069 | 954 | 751 |
| యూదు | 259 | 238 | 220 | 181 | 130 | 109 |
| ఎవాంజెలికల్ క్రిస్టియన్ బాప్టిస్టు | 2917 | 3054 | 2964 | 2981 | 3078 | 2976 |
| పెంతో కొస్తల్స్ | 1006 | 904 | 965 | 775 | 863 | 843 |
| సెవన్త్‌డే అడ్వెంటిస్ట్ | 339 | 372 | 350 | 381 | 434 | 445 |
| జెహోవాస్ విట్నెసెస్ | 607 | 468 | 480 | 411 | 411 | 378 |
| మొత్తం (యితర మతాలతో సహా) | 22,698 | 17,507 | 16 323 | 15,687 | 15,713 | 15,036 |

పాదార్థిక ప్రతి ఫలాన్ని యిచ్చినప్పటికీ అప్పుడప్పుడు వారికి నైతిక ప్రోత్సాహ మివ్వలేదు. నేరాలకు శిక్షననుభవిస్తున్న వారి స్వేచ్ఛను పరిమితంచేస్తారు. అయితే ఆస్తికులైన నేరస్థులకు బైబిల్ లేదా ఖురాన్ చదివే హక్కు లేకుండా చేయడం ఒక శిక్ష అని అధికార్లు తరచు భావించారు. యిది చట్ట విరుద్ధం.

అప్పుడప్పుడు స్థానిక ప్రభుత్వాల చర్యలు చాలా అసంబద్ధంగా ఉంటాయి: చనిపోయిన వ్యక్తి దగ్గరికి వచ్చే మతగురువుకు ఆటంకాలు, చర్చి గంటలు మోగించకుండా నిషేధాలు: పూజా మందిరాలకు మరమ్మతుల నిరాకరణ, విద్యుచ్ఛక్తి సరఫరా నిలిపివేత. యిలాంటి ఘటనలు జరుగుతుంటాయి.

మతానికి వ్యతిరేకంగా యిలాంటి యుద్ధ తంత్రాన్ని సోషలిస్టు చట్టబద్ధత వుల్లంఘనగా పౌరహక్కుల, స్వేచ్ఛల వుల్లంఘనగా, మతం పట్ల ఆస్తికుల పట్ల అనుసరించాల్సిన లెనినిస్టు సూత్రాలకు విరుద్ధమైనదిగా పార్టీ, ప్రభుత్వమూ సూటిగా ఖండిస్తూనే వున్నాయి. యిలాంటి ఘటనలు మత వ్యవహారాల సమితి దృష్టికివస్తే పరిస్థితిని చక్క దిద్దుతుంది. నానాటికీ ప్రగాఢమౌతున్న పునర్ వ్యవస్థీకరణ, ప్రజా స్వామ్యీకరణ, బాహాటత పరిస్థితుల్లో అలాంటి అవకతవకలను మరింత త్వరగా నిర్మూలించడం జరుగుతుందనేది నిస్సందేహం.

పునర్ వ్యవస్థీకరణ తదితర అంశాలు మత పరిస్థితులపై ప్రభావం నెరపాయి. సోవియట్

కమ్యూనిస్టు పార్టీ కేంద్ర కమిటీ 1985 ఏప్రియల్ ప్లీనరీ సమావేశం తర్వాత వివిధ విశ్వాసాలకు చేందిన 173 మత సంస్థలు రిజిస్టరు అయ్యాయి. (అదే సమయంలో 107 మత సంస్థలను రిజిస్ట్రేషన్ నుండి తొలగించడం జరిగింది. నిర్లక్ష్యానికి గురైన 138 పూజామందిరాలను అజమాయిషీలోకి తీసుకోవడం నిర్మించడం లేదా పునర్ నిర్మిచడం జరిగింది. గత 25 యేండ్లలో నిర్లక్షానికి గురైన 700 కు పైగ లితర్జికల్ భవనాలను అజమాయిషీలోకి తీసుకోవడం, నిర్మించడం లేదా పునర్నవీకరించడం జరిగింది. యీ వ్యాసంలోని గణాంక పట్టికలు పాఠకునికి ఒక స్పష్టమైన అవగాహన నిస్తాయి. మొదటి పట్టిక గత 25 సంవత్సరాల్లో మత సంస్థల వివరాలను, రెండవది మత కార్యకలాపాల (వీటిని 1966 నుండి నమోదు చేయడం ప్రారంభించారు) వివరాలను తెలియ జేస్తాయి.

| (ఇవి |
|---|
| కార్యకలాపాలు |
| బాప్టిజమ్స్ |
| ఇందులో పాఠశాలలకు వెళ్ళే పిల్లల బాప్టిజమ్ |
| వయోజనుల బాప్టిజమ్ |
| కన్ఫర్మేషన్స్ |
| వివాహాలు |
| అంత్యక్రియలు |

మత శిక్షణా సంస్థలు దేశంలోని మత పీఠాలకు అవసరమైన సిబ్బందిని సమకూరుస్తున్నాయి. 1960, 1970 లలో 60, ఆ పై వయసుగల వారు కూడా మత బోధకులుగా వుండినారు. యిప్పుడు 40-60 సంవత్సరాల వయో బృందాలకు చెందినవారు మత బోధకులుగా వున్నారు. 1960లలో, అంతకు ముందు కడు వృద్ధులు మత బోధకులుగా వుండడానికి శిక్షణా సౌకర్యాలు లేకపోవడమూ, యింకా వ్యక్తి పూజతో ప్రత్యక్ష సంబంధంగల యితర అంశాలలూ కారణంగా వుండినాయి. వీటిని కమ్యూనిస్టు పార్టీ ఖండించింది. గత 15 సంవత్సరాల్లో మత శిక్షణా సంస్థలు రెట్టింపయ్యాయి. యిప్పుడు వాటి సంఖ్య 250 లకు పైగా వుంది.

భక్తుల అవసరాలను తీర్చడానికి మత పీఠాలకు యిప్పుడు విస్తృతావకాశాలున్నాయి. యివి 25,000 మంది మత బోధకులకు పాదార్థిక పునాదిని సమకూరుస్తున్నాయి. గత 20 యేండ్లలో వీటి వార్షిక ఆదాయాలు రెట్టింపై యిప్పుడు 260 మిలియన్ల రూబుళ్లకు చేరుకుంది.

రూస్‌క్రైస్తవమతానికి మారిన 1000వ వార్షికోత్సవాన్ని 1988 వేసవిలో పాటించనున్నారు

రష్యాకూ పాశ్చాత్య దేశాలకూ మధ్య రాజకీయ, సాంస్కృతిక సంబంధాలను పెంపొందించడంలో, గ్రంధ రచన, వాస్తు శిల్పం, పెయింటిగ్స్‌ను అభివృద్ధిచేయడంలో ఆర్థడాక్స్ చర్చి నిర్వహించిన పాత్రను ఒప్పుకోక తప్పదు. కేంద్రీకృత రాజ్య ఆవిర్భావానికి కూడా చర్చిదోహదం చేసింది. దాని ప్రతినిధుల దేశభక్తి నిర్వివాదమైనది దేశభక్త మహాయుద్ధకాలంలో చర్చి తన సొంత నిధులతో

అలెక్సాండ్ర్ నెవిస్కీ విమాన దళాన్ని ద్మిత్రీదొన్స్కోయ్ టాంకర్ దళాన్ని సమకూర్చిపెట్టింది.

రష్యాలో భావ ప్రకటనా స్వేచ్ఛకొనం ఆర్థడాక్ చర్చి పోరాడింది. కాని అది అంతకు ముందున్న

మతపీఠాలు అందజేసిన వివరాలు)

| 1966 | 1971 | 1976 | 1981 | 1986 |
|---|---|---|---|---|
| 1017228 | 965188 | 808478 | 830596 | 774747 |
| 10261 | 29335 | 25682 | 40253 | 40469 |
| — | 21680 | 26818 | 45178 | 51864 |
| — | 23049 | 24383 | 27333 | 25145 |
| 60516 | 79356 | 74988 | 106259 | 79840 |
| 848805 | 990618 | 1096190 | 1125058 | 1179051 |

ప్రాచీన కట్టడాలను ధ్వంసంచేసింది. రష్యన సామ్రాజ్యంలోని మిలియన్లాది - "అన్యమతస్థులను" రష్యనేతరులను అణచివేసింది. పాలక వర్గాలకు, జారిజానికి, శ్రామిక ప్రజలను దాస్య బంధనాల్లో వుంచడానికి తోడ్పడింది. కాల క్రమేణా ఒక పెద్ద భూస్వామిగా రష్యన్ ప్రజలను పీడించేదిగా మారింది యిదీ అసలు చరిత్ర.

ఆర్థడాక్స్ చర్చి తన వుత్సవాలను జరుపుకో కుండా నిరోధిస్తున్నారని పాశ్చాత్యదేశాల్లో దుష్ప్రచారం జరుగుతోంది. యీ వుత్సవాల సందర్భంగా ఆర్ట్ అల్బమ్స్, గైడ్‌బుక్స్, మత గ్రంథాల ప్రచురణలో, అసలు వుత్సవాల నిర్వహణలో మంత్రిమండలి తాలూకు మత వ్యవహారాల సమితి గణనీయమైన సహాయం చేస్తోంది. అంతేకాదు, యీ వుత్సవాల సందర్భంగా చర్చికి సేయింట్ డేనియల్ మఠాన్ని సోవియట్ ప్రభుత్వం అప్పగిస్తోంది. యిదంతా సోవియట్ శాసనాలకు అనుగుణంగా జరుగుతోంది. సామాజ సమూల పునర్నవీకరణ కోసం సోవియట్ కమ్యూనిస్టు పార్టీ అనుసరిస్తున్న పంథాలను ఆస్తికులలో అత్యధిక సంఖ్యాకులు బలపరుస్తున్నారు.

# సోసచర్చా వేదిక

"ప్రజాస్వామ్యాన్ని గురించి మాట్లాడ్డంలో గొర్బచేవ్ అభిప్రాయాలు ఏమైనప్పటికీ అది వేరు. పాశ్చాత్య దేశాలలో ప్రభుత్వ రూపాలు వేరు. ఆ రెంటికీ పోలికే లేదు." పశ్చిమ జర్మనీ పత్రిక డీవెల్ట్ (జనవరి **28**)చేసిన వాఖ్య యిది. ఇలాంటి వాఖ్యల్ని పాశ్చాత్య. పత్రికల్లో అనేకం చూపవచ్చు.

**అతి గంభీరమైన సోషలిస్టు ప్రజాస్వామ్యం సైతం పాశ్చాత్యులు అంగీకరించగల ప్రజాస్వామ్యం ఎన్నటికీ కాబోదు అన్నది పచ్చి మితవాత వాదన. సోవియట్ సమాజం తన పద్ధతులు మార్చుకుంటూందనీ, పాశ్చాత్య ప్రపంచంలో స్థిరబడిన సరళిలో ప్రజాస్వామ్య విలువలు అది నేర్చుకొంటోందని చాలా మంది వామపక్ష భావాలుగల రాజకీయ పాత్రికేయులు, వ్యాఖ్యాతలు భావిస్తున్నారు.**

అయితే యీ విషయంలో నేను మితవాదుల అభిప్రాయంతోనే ఏకీభవిస్తాను. పాశ్చాత్య సోషలిస్టు పాశ్చాత్య ప్రజాస్వామ్యం అంటే కేవలం రూపంలో మాత్రమే వుంటుందనీ నిజమైన న్యాయమైన ప్రజాస్వామ్యం సోవియట్‌లోనే వుందనీ అన్నాం.

ఇదంతా గంభీరమైన విషయాన్ని అతిగా సరళీ కరించడం. ఒకర్నొకరు అర్థం చేసుకోవాలన్న ఆకాంక్ష కూడా లేకపోవడం "ప్రజాస్వామ్యం" అన్న పదం అర్థాన్ని కూడా చదవ నిరాకరించడం. ఆపదానికి ప్రాచీన గ్రీకులో అర్థం "ప్రజల అధికారం" కాని అది చెప్పిన మూల గ్రంధం గురించి ఆలోచించే వారే లేకపోయారు.

అరిస్టాటిల్ చెప్పిందిది: "కొద్ది మంది పాలన అన్నది ఆస్తులున్న వారికి ప్రభుత్వంలో అత్యున్నత అధికారం వుండడం; ప్రజాస్వామ్యంలో ఆస్తులు లేనివారి చేతిలో యీ అధికారం వుంటుంది."

**-ద్మిత్రి వసీలియేవ్**

# ఏది ప్రజాస్వామ్యం?

ప్రజాస్వామ్యాలను పోల్చి చూడాలంటే వాటిలో వుమ్మడిగా వున్నట్టు కనిపించే అంశాలను గాక, వాటిని విభజించే అంశాలేమిటో చూడ్డం చాలా ముఖ్యం.

## మూల గ్రంధం చూడండి

ప్రజాస్వామ్యాన్ని గురించి **అటు పాశ్చాత్య** ప్రచారమూ యిటు మన ప్రచారము **చాలా కాలంగా** యిస్తూ వచ్చిన నలుపు - **తెలుపు నిర్వచనాలు ఆధునిక భావాలుగల వ్యక్తికి ఎంత మాత్రమూ** సంతృప్తి నివ్వబోవు. మొత్తం స్వేచ్ఛ అంతా తమ గుత్త సొమ్మని పాశ్చాత్యులు డప్పేసుకున్నారు. సోవియట్ సమాజం అంటే ప్రజాస్వామ్యం లేశ మాత్రమైనా లేని నిరంకుశపాలనగా వారు చిత్రీకరించారు. దాన్ని రాజకీయంగా తిరగేసినపుడు యిటునుంచి మన తీర్పు కూడా అలాగే వుంది.

ఆయన చెప్పినదే మరొకటి"......... "అధికారం అనేది అల్ప సంఖ్యాకులదైనా, అధిక సంఖ్యాకులదైనా అది సంపదపై ఆధారపడి వున్నప్పుడు అది కొద్దిమంది పాలనే అవుతుంది; అయితే ఆస్తులు లేనివారు పరిపాలిస్తున్నట్లయితే అదెక్కడైనా ప్రజాస్వామ్యమే అవుతుంది; ఆస్తిపై ఆధారపడ్డపుడు మొదట పేర్కొన్న సందర్భంలో అయితే అది అల్ప సంఖ్యాక పాలనే, యిక రెండవ సందర్భంగురించి చెప్పాలంటే అధిక సంఖ్యాక పాలన అన్నది మచ్చుకు కనిపించే సూచన."

అంచేత ఆధునికులు సామాజిక లేదా వర్గ సారంగా పిలిచేదానిపైనే "ప్రజాస్వామ్య" పదాన్ని మొదట్లో రూపొందించిన ప్రాచీనులు కేంద్రీకరించారు. ఓట్ల లెక్క తదితర అంశాలను "మచ్చునకు" సంబంధించినవిగా భావించారు.

ఏవిధ రకాల ప్రజాస్వామ్యాల — సోషలిస్టు, పాశ్చాత్య—మధ్య బయటకు కనిపించే సారూప్యాలు వారు ప్రయోగించే మాటల సూత్రాలలో కనిపించే వే. "ఒక మనిషికి ఒక ఓటు" "కార్మికుని నుంచి మంత్రి దాకా అందరికి చట్టం సమానమే" "పే పరు బాయికూడా అధ్యక్షుడు కావచ్చు." "ప్రతి వంటవాడూ రాజ్యాన్ని పాలించాలి." వంటి మాటలవి. యివన్నీ అలంకారికాలు అసలు జీవిత సంక్లిష్టతలకు అవి ఎన్నటికీ ఎక్కడా పరివ్యాప్తం కాజాలవు.

పేపరు బాయిని అదృష్టం వరించవచ్చు. సామాన్య సైనికుల స్థాయి నుంచి మార్షల్‌లు అయిన వారి పేర్లు తెలిసినవే. అయితే శక్తి సామర్థ్యాలు అదృష్టం గల ఒక వ్యక్తి జీవితం వేరు, మొత్తం సమాజ స్థితిగతి వేరు.

### 1917 చౌరాస్తా

70 ఏళ్ళ క్రితం ఆస్తి లేని వారు లౌ శ్రామి కులు, రైతులు — అధికారాన్ని హస్తగతం చేసు

"మరింత సరైనది" గా రుజువైంది అనే విషయా న్ని సిద్ధాంతీకరించడాన్ని సామాజిక రాజకీయ ఆలోచనా ధోరణులు విడచిపెట్టబోవు. అయితే తమ సొంత సమాజంలో ప్రజాస్వామ్య పరిస్థితి యేమిటి అన్నది ప్రజలకు ఎంతో ఆసక్తికరమ యింది. అంతే తప్ప "ఆవతలి పక్షపు సమాజంలో పరిస్థితి మరింత అధ్వాన్నంగా వుంది" అనే మాటలతో వారేమీ వూరట పొందబోరు.

### స్వదేశంలో ప్రజాస్వామ్యం

"ఆత్మను కోల్పోయిన అమెరికా రాజకీయాలు" "బ్రిటన్ స్వేచ్ఛలేని దేశం" "బ్రిటన్‌లో రాజకీయ ప్రయోగాలు" - యివి అమెరికాలో బ్రిటన్‌లో యిటీవలి సంవత్సరాల్లో ప్రచురితమయిన పుస్తకా ల్లో మచ్చుకు కొన్ని. డి.డిగ్గెన్స్, టి.డు క్వాయ్‌స్నె, ఇ. గుడ్‌మాన్, పి. హెయిన్ వంటి రచయితలు, పాశ్చాత్య దేశాలలో ప్రజాస్వామ్య సాంప్రదాయాలకు, విలువలకు గౌరవం సన్నగిల్లుతోందన్న ఆందోళన ను వారి వారి సొంత పద్ధతుల్లో వ్యక్తీకరించారు.

# అరిస్టాటిల్‌నడగండి...

కోవడంతో రష్యాలో విప్లవాత్మక సోషలిస్టు పునర్ని ర్మాణం ఆరంభమైంది. అంటే మంత్రి పదవుల న్నీ వారితోనే నిండిపోయాయని కాదు. ముఖ్యంగా బాగా చదువుకున్న మేధావులే అత్యున్నత పదవుల నలంకరించారు. అయితే ప్రజల పాలన స్థాపన దృష్ట్యా ముఖ్యమైన ఆర్థిక, రాజకీయ అధికార స్థానాలలోకి "పునాది స్థాయిల" వారిని విప్లవం ఏకరీతిగా ప్రొమోట్ చేసింది. ఆ విధంగా సోషలిస్టు ప్రజాస్వామ్యం లేదా అరిస్టాటిల్ దృష్టిలో చూసిన రకం ప్రజాస్వామ్యం రష్యన్ గడ్డమీద పుట్టింది.

ఇక పాశ్చాత్య ప్రజాస్వామ్య పరిణామాభివృద్ధిలో చూస్తే అరిస్టాటిల్ "మచ్చుకు" అని చెప్పినదే ప్రధాన సారమైంది. ధనికుల, పేదల పాత్ర రాజకీయాల్లో భిన్నంగా వుంటుందనే విషయం మరిచిపోవడం జరిగింది.

పాశ్చాత్య, సోషలిస్టు తరహా సోషలిజాల భిన్న మార్గాలు అలా చీలాయి. అదింకా అలా సాగు తూనే వుంది. ఏది "మెరుగైంది" గా ఏది

వారి వ్యాఖ్యలను చూస్తే వారు సోషలిస్టు వ్యవస్థను యెంత మాత్రం అంగీకరించబోరని స్పష్టంగా చూడవచ్చు. అయితే తమ వ్యవస్థలోని లోపాలను విమర్శిస్తున్న అలాటివారు "సోవియట్ నియంతృత్వం" "సోషలిజంలో మానవ హక్కులే లేవు" వంటి చౌకబారు ఆరోపణల స్థాయికి దిగజా రడాన్ని నేను వూహించజాలను.

మరింత హెచ్చు మరింత సంపూర్ణ సోషలిజా న్ని పెంపొందించడానికి సోవియట్ యూనియ న్‌లో అత్యంత ప్రాధాన్యమిస్తున్నారు. అరిస్టాటిల్ గీటురాయి ప్రకారం చూస్తే ప్రజాస్వామ్య తరహా జీవితానికి పాశ్చాత్య దేశాలలో కన్నా సోవియట్ యూనియన్ మరింత "వాస్తవికంగా" "నిజంగా" దగ్గరగా వుంది.

**మరింత ప్రజాస్వామ్యం కోసం సోవియట్ సమాజ పురోగమనాన్ని, యీ క్రమంలో యిమిడి వున్న సమస్యలన్నీ స్టాలినిజం అవశేషాల వాటి నిర్మూలనగాను,1937నాటి, ఘటనలకు ప్రతీకగా**

**తాము చూసె సరళి ప్రభుత్వ పద్ధతులతో తెగ తెంపులు చేసుకోవడంగాను భాష్యంచెప్పే ధోరణి పాశ్చాత్య దేశాలలో చాలా విస్తృతంగా వుంది. ఈ రకమయిన తీర్పు అతిగా సాధారణీకరించే వైఖరికి ప్రతిబింబం. అంతేకాదు. ఈనాటి వాస్తవాల పట్ల పూర్తి నిర్లక్ష్యం యీ తీర్పులో వ్యక్తమవుతున్నది.** 1937నాటి దురంతాలను మసిబూసి మారేడు కాయ చేయడానికి ఎవరూ ప్రయత్నించడం లేదు. అయితే అది గుర్తుంచుకోవలసిన అంశంగా మారిపోయి చాలా కాలం అయింది. ప్రజాస్వామ్యంలో సోషలిజంలో వక్రీకరణలు దుర్వినియోగాలు జరగకుండా సోవియట్ కమ్యూనిస్టుపార్టీ ప్రభుత్వమూ నిర్ణయాలను, చర్యలను తీసుకున్నాయి. యిప్పుడు పరిష్కరించబూనుకున్న సమస్యలు ముఖ్యంగా సోషలిస్టు ప్రజాస్వామ్య అభివృద్ధి క్రమంలోపలే తలెత్తిన వైరుధ్యాలను అధిగమించడానికి సంబంధించినవి.

## కొత్త సమస్యలు కొత్త పరిష్కారాలు

ప్రజాస్వామ్యానికి సంబంధించి మౌలిక సూత్రాన్ని (అరిస్టాటిల్ చెప్పింది) సోవియట్ సమాజం నిరంతరం పాటిస్తూ వచ్చింది. ఎన్నటికీ దీన్ని విడిచిపెట్టబోదు.

ముఖ్యంగా అల్ప సంఖ్యాక జాతుల వారికి, సామాజిక ఆర్థిక సాంస్కృతిక రంగాలలో వెనకబడిన వారికి ప్రత్యేక హక్కులు కల్పించడంపట్ల శ్రద్ధను తనకీలక లక్ష్యంగా బహుళజాతి సమాజం అయిన సోవియట్ యూనియన్ పెట్టుకుంది. ఆయా నిర్దిష్ట స్థానిక ప్రభుత్వ సంస్థలలో స్థానిక ప్రజలకు తగు ప్రాతినిధ్యం వుండేలా పరిపాలనాపరమయిన ప్రత్యేక చర్యలు తీసుకుంది.

ఎన్నికల ప్రచారంలో ఏ స్థాయిలోనూ "మధ్యవర్తులు" యెవరూ లేకుండా మొత్తంగా ఓటర్ల ఏచక్షణకే అభ్యర్థుల నామినేషన్, పోటీ, దాని ఫలితాలు అన్నిటినీ విడిచిపెట్టినట్టయితే ఏమవుతుంది? "బాస్‌ల అభ్యర్థులు" దెబ్బతింటారని "కమ్యూనిస్టు నియంతృత్వం" అడుగుజారుతుందని, రష్యనేతర మండలాలలో "రష్యన్‌ల ఆధిపత్యం అంతమవుతుందని" పాశ్చాత్య ప్రపంచంలోని వారి నమ్మకం. నిజానికి దానికి వ్యతిరేకమయిన ఫలితాలు వచ్చే ప్రమాదముంటుంది. అలాటి స్థితిలో ప్రజతో సంబంధాలు పెట్టుకోవడంలో ఉపన్యాసాలు చేయడంలో పోటీలో ఎవరు పైచేయి సంపాదించ గలుగుతారు? ఒక మామూలు కార్మికుడా ఒక మేనేజిరియల్ అధికారా? మాతృభాష రష్యన్ ధారాళంగా మాట్లాడేవారా లేక రష్యన్ భాషలో నట్లుపడుతూ మాట్లాడే స్థానిక జాతుల వారా?

గత జూన్‌లో స్థానిక సోవియట్ల ఎన్నికలో బహుళ అభ్యర్థిత్వం అనేది సర్వే సర్వత్రా కాకుండా అక్కడక్కడ మాత్రమే జరిగింది. కొన్ని సందర్భాలలో ఓటింగ్ ఫలితాలు ప్రోత్సాహకరంగా వున్నాయి. మరికొన్ని చోట్ల చాలా ఆశాభంగం కలిగించాయి. సోవియట్ ఎన్నికల వ్యవస్థను మెరుగు పర్చడం అవసరం, ఎంతో కృషి అవసరమయిన పెద్ద సమస్య అది.

**పాశ్చాత్య ప్రజాస్వామ్యాన్నీ సోషలిస్టు ప్రజాస్వామ్యాన్నీ పోల్చేటపుడు, ఆసక్తికరమయిన అంశం ఒకటుంది. బాహాటంగా మాట్లాడడం, విమర్శకు పూర్తి స్వేచ్ఛ మరింతగా బలపడుతున్న కొద్దీ యిది మరింత వెలుగులోకి వస్తోంది. పత్రికలకాలాలలో, టెలివిజన్ కార్యక్రమాలలో స్పష్టంగా వ్యక్తమైన ప్రజల డిమాండ్‌కు ప్రతిస్పందనగా సమర్థవంతమయిన చర్యలు లేకపోవడంపట్ల సోవియట్ ప్రజలలో నానాటికీ మరింతగా ఆందోళన పెరుగుతోంది. అదీ ఆ అంశం.** ప్రభుత్వ సంస్థలు, ఉన్నతాధికారులు బహిరంగంగా అభిశంసనలకు గురయిన తర్వాత, ఆ విమర్శను అంగీకరిస్తున్నప్పటికీ దానికి ప్రతిస్పందించడంలో విఫలమవుతున్నారు.

ఈ ఆందోళనను ప్రతిబింబిస్తూ వ్యక్త మవుతున్న కొన్ని విలక్షణాయుత వ్యాఖ్యలు గమనార్హం: పాశ్చాత్య సరళి ప్రజాస్వామ్యం పట్ల భ్రమల విషయంలో మనం జాగ్రత్తగా వుండాలి: యిష్టం వచ్చినట్టు యిష్టం వచ్చినంత సేపు మాట్లాడు. దానివల్ల ఏమీ మారిపోవడం లేదు. లేదా మరో వ్యాఖ్య చూడండి: "రెడ్‌టేప్‌ల వాళ్లు ప్రజాస్వామ్యంతో బాటే తామూ మనగలగడం నేర్చుకున్నట్టుంది. ప్రజాస్వామ్యాన్ని ఖాతరు చేయకుండా వుండటాన్ని వాళ్లిప్పటికే నేర్చుకున్నారు. పాత పద్ధతుల్లోనే వ్యవహారాలు నడుపుకుపోతున్నారు. మన ప్రజాస్వామ్యం ఆ రకమైంది కాదని వారి కర్థమయేట్టు చేయాలంటే కొంచెం సూటిగా ప్రయత్నం జరగాలి. మాటకన్నా ఎక్కువగా అది పనిచేయాలి."

మొదట్లో ప్రాచీన గ్రీసులో ప్రజాస్వామ్యం అనే దాన్ని సానుకూలమైన లేక ఆదర్శవంతమైన వ్యవస్థగా యేమీ పేర్కొనలేదు. 'కొద్దిమంది పాలన' లేదా 'ఏకవ్యక్తిపాలనకు' భిన్నమైన 'అనేకుల పాలన' గా మాత్రమే దాన్ని వారు పేర్కొన్నారు. అనేకవిధాల ప్రతికూల అంశాలు అందులో వున్నాయి. 'అనేకుల పరిపాలన' అనే పదానికి అర్థం 'అత్యధికులపాలన' కాదు, 'సర్వుల పాలన' అన్నది అనలేకాదు. దాన్ని ప్రాచీన గ్రీసు బానిస సమాజం అని గుర్తుంచుకోవాలి. నాటి ప్లేటో, అరిస్టాటిల్‌ల కాలంలోని ఏథెన్స్ నగర రాజ్యంలో సైతం ప్రత్యక్ష ప్రజాస్వామ్యంలో పాల్గొనడానికి అర్హతవున్నపౌరులుగా వర్గీకరించిన వ్యక్తుల సంఖ్య మొత్తం జనాభాలో 7 నుంచి 13 శాతానికి ఎన్నటికీ మించలేదు. మహిళలను పూర్తిగా వదిలిపెట్టి పురుషులలో ఆస్తులున్నవారిని, విద్యావంతులైన వారిని మాత్రమే అందులో చేర్చడం జరిగింది.

# మారుతూన్న ప్రజాస్వామ్య స్వభావం


**ప్రొ. రషీదుద్దీన్‌ఖాన్**

**(జవహర్లాల్ నెహ్రూ విశ్వవిద్యాలయం)**


అరిస్టాటిల్ ఆరువిధాల ప్రభుత్వ రూపాలను పేర్కొన్నారు. చక్రవర్తి పాలన, నియంతృత్వం, కులీన బృంద పాలన, కొద్దిమంది పాలన, వ్యవస్థాపిత రాజ్యపాలన, ప్రజాస్వామ్యం. వీటన్నిటిలోనూ అత్యుత్తమమైన వాటిలో అధ్వాన్నమైనది (వ్యవస్థాపిత రాజ్యపాలనా రూపం అత్యుత్తమం; అది చక్రవర్తి పాలన, కులీన బృందపాలన, ప్రజాస్వామ్యాలలోని కీలక సూత్రాల మేళవింపు జరిగిన 'స్వర్ణసాధనం') అదే సమయంలో అధ్వాన్నమైన రూపాలలో అత్యుత్తమమైనది (అన్నిటికన్నా అధ్వాన్నమైనది నియంతృత్వం, 'ఏకవ్యక్తి' వ్యక్తిగత పాలన) ప్రజాస్వామ్యం అని అరిస్టాటిల్ భావించారు. దానిక్కారణం ప్రజాస్వామ్యం అంటే 'పేదలు, అమాయకులు, విజ్ఞానం లేనివారి పాలన' అనీ వారే 'అనేకులైన' గుంపు అనీ అరిస్టాటిల్ భావన. అందుకే ప్రజాస్వామ్యాన్ని 'గుంపు పాలన' అనికూడా పిలిచారు.

17 వ శతాబ్దంలో ఇంగ్లండ్‌లో సమతావాదులు ఆవిర్భవించినాకనే ప్రజాస్వామ్యం అనేది కొంతవరకు అభిలషణీయమైందిగా సానుకూలమైందిగా రూపొందింది. అయితే ఆ భావన విస్తరించలేక పోయింది. 18 వ శతాబ్దం చివరిలో సైతం అమెరికన్ రాజ్యాంగ వ్యవస్థాపక పితరులు 1776 ఫిలడెల్ఫియా సదస్సులో ప్రజాస్వామ్యం అనే మాటకు బదులు 'రిపబ్లికన్‌వాదం' అనే పదాన్నే ఎంచుకున్నారు. ప్రసిద్ధ ఫ్రెంచి రచయిత అలెగ్జియా డిటకవిల్లె అమెరికాలో ప్రజాస్వామ్యం అనే పుస్తకంలో అమెరికా ప్రజాస్వామ్యంలోని అనేక లోపాలను విమర్శించారు. అధ్యక్షపాలన ఒకే వ్యక్తికి ఎక్కువ అధికారాన్ని కట్టబెడుతుంది. శాసన సభలకు ప్రభుత్వ కార్యనిర్వాహకులు నిరంతరం జవాబుదారీగా వుండాలనే సూత్రానికి, ప్రజాస్వామిక అజమాయిషీ సూత్రానికి యిది విరుద్ధం.

1789 ఫ్రెంచి విప్లవ విజయానంతరం జాకొబిన్‌లు ఫ్రాన్స్‌లో 'రిపబ్లికన్‌వాదం' గొప్పదని భావించారు. ఫలితంగా 1815 నుంచి 1965 వరకు 150 సంవత్సరాలలో అయిదు రిపబ్లిక్‌లు ఆవిర్భవించాయి, పతనమైనాయి అంతే తప్ప పూర్తిస్థాయి ప్రజాస్వామ్య పునాదులు స్థిరపడలేదు.

పార్లమెంటరీ ప్రజాస్వామ్య వ్యవస్థకు తల్లి అని చెప్పే ఇంగ్లాండ్‌లో సైతం కుటుంబ పారంపర్య చక్రవర్తిత్వం (అదికూడా ఇంగ్లాండ్ ప్రొటెస్టెంట్ చర్చికి కట్టుబడి వున్నవారికే), హౌస్ ఆఫ్ లార్డ్స్ (ప్రభువుల సభ), ముఖ్య కామనర్లకు వృద్ధాప్యంలో పీర్‌ల స్థానాన్నివ్వడం వంటివి అసలు ప్రజాస్వామ్యానికేకాదు. రిపబ్లికన్ వ్యవస్థకు సైతం ప్రాథమికంగా విరుద్ధమైన అంశాలు. యింకా ఆశ్చర్యమేమంటే ప్రజాస్వామ్యానికి పునాది అయిన సార్వత్రిక వయోజన ఓటుహక్కు యింగ్లాండ్‌లో చాలా అనాసక్తంగా 1929 లో ప్రవేశపెట్టారు. అదికూడా 1928 నాటి పార్లమెంటరీ సవరణద్వారా. 1830 నాటికి బ్రిటన్‌లో ఓటు హక్కుగలవారు మొత్తం జనాభాలో 2.7 శాతం మాత్రమే. ఆ సంఖ్య 1883 నాటికి 9.9 శాతానికి పెరిగింది. 1910 నాటికికూడా వారి సంఖ్య 17.6 శాతం మాత్రమే. 1918 నాటికీ 45.9 శాతమే. 1929 లో మాత్రమే అది 62.6 శాతానికి పెరిగింది.

ప్రథమ ప్రపంచ యుద్ధం ముగిసిన తర్వాతే ప్రజాస్వామ్యానికి ప్రాచుర్యం ఉప్పెనలా వచ్చింది. సోవియట్ యూనియన్‌లో 1917 అక్టోబరు విప్లవానంతరం అంతకు ముందు ప్రపంచానికి తెలియని భిన్నమైన కొత్త రాజకీయ వ్యవస్థ ఏర్పడటంతో బాటు రెండు యుద్ధాల మధ్యకాలంలో 1919-1939 మరోనాలుగు కొత్త రిపబ్లిక్‌లు మాత్రమే ఆవిర్భవించాయి. అవి పీమర్ జర్మన్, జకొస్లావాక్, పోలిష్, టర్కిష్ రిపబ్లి క్‌లు. బ్రిటిష్ ఫెబియన్ సోషలిజం సిద్ధాంతకర్తలు సిడ్నీ బీట్రిస్‌వెబ్‌లు సోవియట్ యూనియన్‌ను 'బహుళరూప ప్రజాస్వామ్యం' అని, 'ప్రపంచం లోని అత్యంత సమానమైన, నకల లక్షణాలుగల ప్రజాస్వామ్యం' అని పేర్కొన్నారు.

రెండవ ప్రపంచ యుద్ధానంతరం యూరపియన్ సామ్రాజ్యవాద వ్యవస్థ కూలిపోయాక ఆసియాలోనూ ఆ తరవాత ఆఫ్రికాలోను ప్రాచీన సమాజంలో కొత్తరాజ్యాలు ఆవిర్భవించాయి. 1945 లో ఐక్యరాజ్యసమితిలో సభ్యదేశాలు 50 కన్నా తక్కువ. ఈ రోజున వాటినంఖ్య 159. వందరాజ్యాల్లో ప్రస్తుత పాలన సైనిక నియంతృత్వం, కులీన బృందపాలన వంటి రూపాల్లో వున్నప్పటికీ యివన్నీ భవిష్యత్తుల్లో ప్రజాస్వామ్యాన్ని ఆకాంక్షిస్తున్నవే.

సోవియట్ యూనియన్‌లో వున్న శ్రామికవర్గ ప్రజాస్వామ్యం యితర సోషలిస్టు దేశాల పీపుల్స్ డెమొక్రసీలు యివి పెట్టుబడిదారీ ప్రపంచంలోని 'బూర్జువా' ప్రజాస్వామ్యంకన్నా భిన్నమైనవని మార్క్సిస్టు విశ్లేషకులు వర్గీకరించారు. బూర్జువా ప్రజాస్వామ్యాలపాలన విశాల ప్రజానీక పాలనకాదు అన్న కారణంచేత మార్క్సిస్టులు వాటిని విమర్శిస్తారు.

అయితే ప్రజాస్వామ్యం అంటే ఏమిటి? దానికి ఆరు నిర్దిష్ట అర్థాలున్నాయి.

1. ఒక ప్రభుత్వరూపం 2. ఒక రాజ్య రూపం 3. ఒక సామాజిక వ్యవస్థానరళి 4. ఒక ఆర్థిక వ్యవస్థరూపం 5. ఒక జీవన, సంస్కృతీ విధానం 6. సమానత్వం, స్వేచ్ఛ న్యాయం విలువలకు హామీ వుండే ఒక సామాజిక ఉనికిసరళి. ఒక సామాజిక రాజకీయ ఆదర్శంగా సాధికారమైన సంపూర్ణమైన నిజమైన వ్యవస్థగా ప్రజాస్వామ్యం ఉండాలి అంటే యీ ఆరు అంశాలు మిళితమై వుండాలి.

ఒక నిజమైన సమగ్రమైన ప్రజాస్వామ్యానికి ముఖ్యంగా విలువలు, నియమాలదృష్ట్యా పూర్వాపేక్షితాలేమిటి? వాటిని మూడు బృందాలుగా వర్గీకరించవచ్చు. (అ) సామాజిక పరిస్థితులు (ఆ) ఆర్థిక పరిస్థితులు (ఇ) రాజకీయ పరిస్థితులు, సామాజిక పరిస్థితులలో యీకిందివి భాగం. (1) న్యాయచట్టం ముందు సామాజిక హోదాలో అభివృద్ధికి అవకాశంలో సమానత్వం. (2) సామాజికంగా, పంపిణీపరంగా న్యాయం. (3) సామాజిక భద్రత, సామాజిక సంక్షేమం. (4) అందరికీ విద్య. ఆర్థికపరిస్థితిలో యీకింది అంశాలున్నాయి. (1) ఆర్థిక వుత్పత్తి సాధనాలపై సామాజిక అజమాయిషీ, (2) పని చేసే హక్కు ఉపాధి హక్కు. (3) సామాజికార్థికాభివృద్ధి కృషిలో బహుళ ప్రజానీకం సమీకరణ, వారి నిమగ్నత. రాజకీయ పరిస్థితులలో యీ కింది అంశాలున్నాయి, (1) ఆలోచన, వ్యక్తీకరణ, విశ్వాసాలు, రాకపోకలు, కమ్యూనికేషన్, సంఘాల ఏర్పాటు వీటికి స్వేచ్ఛ. (2) వయోజన సార్వజనీన ఓటు హక్కు (3) బలమైన రాజకీయ భాగస్వామ్యం (4) విధాన నిర్ణాయక యంత్రాంగంపై ప్రాతినిధ్య నంస్థల, ప్రజల అజమాయిషీ (5) ప్రజలకు ప్రభుత్వమూ, పరిపాలనా యంత్రాంగం జవాబుదారీగా వుండటం (6) న్యాయ శాన నాయుత పాలన, న్యాయ వ్యవస్థకు కార్యనిర్వాహక యంత్రాంగంనుంచి శాసనసభ నుంచి స్వేచ్ఛ (7) పౌరులందరి హక్కులకు, విధులకు సమానస్థాయిలో గుర్తింపు.

వీటిలో ఏదో ఒక నియమాల సముదాయం మాత్రమే వుంటే అది పాక్షిక ప్రజాస్వామ్యం అవుతుంది. రాజకీయ ప్రజాస్వామ్యం, ఆర్థిక ప్రజాస్వామ్యం, సామాజిక ప్రజాస్వామ్యం—యీమూడు వుంటేనే సమగ్ర ప్రజాస్వామ్యం అవుతుంది. యిలా ఒకటుంటే ఒకటిలేని ప్రజాస్వామ్యాలు ప్రపంచంలో చూస్తున్నాం.

ఈ సందర్భంలో గొర్బచేవ్ ఆరంభించిన 'నూతన ఆలోచనాధోరణి' సోవియట్ యూనియన్‌కు మాత్రమేగాక మొత్తం ప్రపంచానికి, యీ యుగపు నాయకులందరికీ అవసరమైన విషయని చెప్పాల్సివుంది. రూపంలోనేగాక సారంలోకూడా మరింత ప్రజాస్వామ్యయుత ప్రపంచాన్ని నిర్మించేందుకు యిది అవసరం.

మానవ విలువలు

# లెనిన్ నైతిక వారసత్వం ఆధునిక కాలం



డా. వాసిలీ రొగూవిక్ (తత్వ శాస్త్రం)
(సోవియట్ విజ్ఞాన శాస్త్రాల అకాడమీ సామాజిక
పరిశోధన ఇన్‌స్టిట్యూట్ ముఖ్య
పరిశోధకుడు)

వి.ఐ. లెనిన్ 1920

సోషలిజానికి కొత్త శక్తి నిచ్చి ముందుకు తీసుకెళ్లే ఉద్యమంలో సోవియట్ ప్రజలు నిమగ్నమై వున్నారు. లెనిన్ సైద్ధాంతిక నైతిక వారసత్వం నుంచి స్ఫూర్తిని గ్రహించి, గతం నుంచి పాఠాలు తీసుకుని భవిష్యత్తు కోసం సరైన నిర్ణయాలు చేయడం తిరుగులేని అవసరంగా భావిస్తున్నారు. కమ్యూనిస్టు పార్టీకీ ప్రజలకూ లెనిన్ రాజకీయ వీలునామాగా పరిగణిస్తూన్న లెనిన్ చివరి లేఖలపై వ్యాసాలపై యిప్పుడందరూ కేంద్రీకరిస్తున్నారు లెనిన్ సూచనలు సిఫార్సులలో చాలా వాటిని పూర్తి స్థాయిలో అమలు పర్చడం జరగలేదు. ముఖ్య కారణం స్టాలిన్‌లో వున్న ప్రతికూల లక్షణాలు లెనిన్ మరణానంతరం మరింత బలంగా వ్యక్తమై అతని రాజకీయ ప్రవర్తనగా, నాయకత్వ సరళిగా రూపుగొన్నాయి. అధికారం కోసం దేనికైనా సమకట్టడం, ఏక వ్యక్తి పాలన - యివి లెనిన్ రాజకీయ సూత్రాలకు పూర్తి విరుద్ధమైనవి. యివి స్టాలిన్ కాలంలో వేలాది కమ్యూనిస్టుల పైనా, పార్టీయేతరులపైనా మూకుమ్మడిగా సాగిన చట్ట విరుద్ధ శిక్షలలో వ్యక్తమైనాయి. అలా శిక్షలకు గురైన వారిలో పార్టీ ప్రభుత్వ సైనిక నాయకులు, ప్రముఖ శాస్త్రజ్ఞులు, సృజనాత్మక కళాకారులు వున్నారు. పార్టీకి దేశానికి ఎంతో నష్టం జరిగింది. వాటిని సోవియట్ సమాజ చరిత్రలోనే అత్యంత విషాదకర ఘట్టాలుగా ప్రజలు పరిగణిస్తున్నారు.

అయితే స్టాలిన్ మరణానంతరం కూడా పార్టీ జీవితం, రాజనీతిజ్ఞతా రంగాలలో ప్రమాణాలను పూర్తి స్థాయిలో అమలు పర్చక పోవడం దురదృష్టం. 1985ఏప్రిల్ కేంద్ర కమిటీ ప్లీనం, అనంతరం పార్టీ 27 వ మహాసభ, తదనంతర ప్లీనరీ సమావేశాలు సోషలిస్టు సమాజంలోని సకల రంగాలలో జీవిత పునర్నిర్మాణానికి నిర్ణయాలు చేశాయి. సామాజిక జీవితంలో ప్రజాస్వామ్య అభివృద్ధి, సామాజిక నీతి, మానవీయకరణ - యివి సంస్కరణకు మూలబలం; సంస్కరణ అమలుకు హామీ.

సామాజిక న్యాయాన్ని అమలు చేసేందుకు తన శక్తినంతటినీ నిస్వార్థంగా అంకితం చేసిన లెనిన్‌ను నేను గౌరవిస్తాను. ఆయన వినియోగించిన పద్ధతి అనుచితమైందని నేను భావించినప్పటికీ ఒక్క విషయం మాత్రం నిర్వివాదం: మానవాళి ఆత్మసక్తి భావనను పరిరక్షించి పునరుద్ధరించేందుకు ఆయనలాటి వారే దోహదం చేస్తారు.

— ఆల్బర్ట్ ఐన్‌స్టీన్

అపారమైన మానవ శక్తి సామర్థ్యాలను ప్రజల సృజనాత్మకత అనే మహావనరులను విప్లవాత్మక పునరుజ్జీవన క్రమంలోకి తేవడాన్ని యివి సాధ్యం చేస్తాయి. తమగత చరిత్రలోని వీరోచిత ఘటనలు ఆశ్చర్యకరఘటనలను నిరావేశంగా పునస్సమీక్షించు కుంటున్న సోవియట్ ప్రజలు సోవియట్ రాజ్య నిర్మాత వి.ఐ. లెనిన్ మేధస్సును సాహసాన్ని ఆయన నైతిక వారసత్వానికి గల తిరుగులేని ప్రాధాన్యతను తాజాగా మరింత స్పష్టంగా గ్రహిస్తున్నారు.

## ప్రతి ఒక్కరూ సమానం

అత్యంత అగ్రగామి రాజకీయ ఉద్యమంలో పాల్గొంటున్న సరే అలాటి వారంతా "అద్భుతమయిన నైతిక లక్షణాలు" కలిగి వుంటారనీ, ఎలాటి తప్పులూ పొరపాట్లూ వారి వల్ల జరగనే జరగవనీ అనుకోవడం తప్పు అని లెనిన్ బాగా అవగాహన పర్చుకున్నారు. వ్యక్తిలో గల అవలక్షణాలు అతడి రాజకీయ వుద్దేశాలను దాటి పైచేయి పొంద గలుగుతాయి. నైతికంగా అద్భుత సుగుణాలు కలిగినంత మాత్రాన రాజకీయ ప్రవర్తనకు అదేమీ గ్యారంటీ కాదు అని ఆయన గ్రహించారు.

తాను ఎంతగానో ప్రేమించిన వ్యక్తుల నుంచి రాజకీయంగా తాను విడిపోయినపుడు వారితో వ్యక్తిగత సంబంధాలను కూడా ఆయన తెంచుకునేవారు. అయితే యిలాటి ఘటనలతో ఆయన మానసికంగా ఎంతో బాధపడేవారు. "ఆయన అభిమానాలు అంత ప్రగాఢమైనవి గనుకనే అంతలా అహరహాలు శక్తికి మించి పని చేశారు" అంటారు లెనిన్ భార్య క్రుప్స్కయా.

ఏ విషయమైనా చర్చిస్తూన్న సమయంలో వ్యక్తిగత విషయాలు లేవనెత్తితే లెనిన్‌కు ఆగ్రహం కలిగేది. వ్యక్తిగత విషయాలు కావు, ఆశయం ముఖ్యం. యిది లెనిన్ నుంచి ఆయన సహచరులు నేర్చుకున్నది అంటారు, జి.వి. చిచెరిన్.

లెనిన్ యీ సూత్రానికి ఎంత దృఢంగా కట్టుబడి వుండేవారు అంటే, ఆశయ ప్రయోజనాలను గురించి చర్చిస్తున్న సమయంలో లెనిన్ వద్ద తనసొంత సమస్యలను గురించి లేవనెత్తడం ఎంతో అసహ్యకరమైన విషయంగా ప్రతిఒక్కరూ భావించేవారు. విషయాన్ని గురించి చర్చిస్తున్నప్పుడు. వ్యక్తి గతమైన తమ సమస్యలను లేవనెతడం సబబైన విషయంకాదు అని లెనిన్‌తో సంభాషణలు జరిపేవారంతా భావించేవారు. ఒక గంభీర విషయాన్ని గురించి వాదోపవాదాలు జరుగుతున్న సమయంలో దాన్ని తప్పించి వ్యక్తిగత దూషణలు, జగడాలు లేవనెత్తినపుడు, అలాగే ఆశయం కోసం కృషిలో నిమగ్నమైవున్న వ్యక్తిపై వ్యక్తిగత దాడులు లేదా వ్యక్తి గుణగణాలపై దాడులు చర్చలోకి తెచ్చినపుడు లెనిన్‌కి చెప్పలేనంతటి ఆగ్రహం కల్గేది ఎప్పుడూ లేనంత కోపం ఆయనకు వచ్చేది. నువ్వు చెయ్యాల్సిన పనేమిటో ముందు ఆలోచించు. నీ వ్యక్తిగత విషయాలుకావు. నువ్వు నిబద్ధమైవున్న ఆశయాలపట్ల శ్రద్ధ నీ వ్యక్తిగత మనోభావాలను స్థితిగతులను అధిగమించి నిలవాలి; యిదీ ఆయనతో పనిచేసినవారు ఆయన నుంచి నేర్చుకున్నది. పైగా సిబ్బంది విషయంలో ఆయన ఎంతో నేర్పుగా చాకచక్యంతో వ్యవహరించేవారు. అవతలి మనిషికి ఎంత యిష్టం లేని విషయాన్నైనా సరే ఎలా చెప్పాలో ఆయనకు తెలుసు. అవతలివాడు నిరుత్తరుడై పోయేలాగా ఆయన ఆ విషయాన్ని తిరుగులేని విధంగా చెప్పేవారు. తనతో పనిచేసే యితరులు కూడా అవతలి మనిషితో వ్యవహరించడంలో యిదే విధమైన నేర్పు చూపాలని ఆయన నొక్కి చెబుతుండేవారు. ప్రభుత్వ చర్యలను తిరుగులేని విధంగా అమలు పర్చాల్సిందే. ఏ విధమైన ప్రతిఘటనగాని, వ్యతిరేకతగాని, విద్రోహంగాని, నిర్లక్ష్యంగాని ఎంతమాత్రమూ అనుమతించకూడదు. వాటిని నిర్దాక్షిణ్యంగా అణచి వేయాల్సిందే. అయితే అందరూ కలసి పనిచేస్తూ తమ బాధ్య తలను నెరవేరుస్తున్నారు. గాబట్టి వారిపట్ల గౌరవ ప్రదంగా వ్యవహరించాలని ఆయన కోరేవారు. అసహనంగాని పరుషమైన పదాలనుగాని అనుమతించేవారు కాదు.''

సిబ్బందితో వ్యవహరించడంలో లెనిన్ ఎంతో నేర్పు చూపేవారు. అవతలవారికి యిష్టం లేని విషయాలు కూడా సామరస్యంగా ప్రతిపాదించేవారు. ప్రముఖ సోవియట్ రాజనీతిజ్ఞుడు వి.వి. వొరొవ్‌స్కీ యిలా రాశారు ప్రభుత్వ యంత్రాంగంలో మనిషికి యింతటి అత్యున్నత స్థానం యిచ్చిన వారెవరూ లేరు. మనుషులను ఆయన వారికున్న శక్తిని మించి అంచనా వేసేవారు. అందరికీ తన కున్నంత శక్తి వుంటుందనుకొని వారికి అంతటి బాధ్యతలు అప్పగించేవారు. ఆయన ఆకాంక్షలకు తాము న్యాయం చేయలేకపోతున్నామని సహచరులు బాధ పడేవారు. అయితే తన సహచరులు కూడా తన అభిప్రాయంతో ఏకీభవిస్తున్నారని స్పష్టం చేసుకుంటే తప్ప లెనిన్ ఏ నిర్ణయమూ తీసుకునేవారు కాదు.''

''ప్రజల వుమ్మడి ప్రయోజనాల కోసం తనతో కలిసిపని చేస్తున్న పోరాడుతున్న వారిపట్ల లెనిన్‌కు ఎంతో ప్రేమాభిమానాలుండేవి. వారిపట్ల ఎంతో ఆర్ద్రతతో, దయతో, ప్రేమతో వ్యవహరించేవారు. అయితే అది తండ్రి ప్రేమలా గంభీరంగా మనసులో వుండేది తప్ప మాటలలో చేష్టలలో ప్రదర్శితమయేది కాదు.''

గోర్కీ యిలా రాశారు: సహచరులపట్ల లెనిన్ ప్రేమ తనతో సమానులైన వారిపట్ల నిజమైన కామ్రేడ్ కుండే హృదయపూర్వక అభిమానంగా వుండేది. అయితే నిజానికి పార్టీలో లెనిన్‌తో సమానమైన వారు ఎవరూ లేరని నాకు తెలుసు. లెనిన్ వాదనలలో చాలా పదునైన మాటలు వుపయోగించేవారు. వారిని మొగంమీదే నిర్దాక్షిణ్యంగా అపహసించేవారు, వ్యంగంగా ఎత్తి పొడిచేవారు. అయితే వారిపట్ల ఆయన అంచనా చాలా నిజాయితీగా వుండేది. వారి శక్తి సామర్థ్యాలు నైతిక బలం, కఠిన పరిశ్రమనూ ఎంతో గౌరవించిన విషయం నాకు తెలుసు.

పార్టీలో తనకు అపారమైన తిరుగులేని అధికారంవుండి నప్పటికీ తన సహచరుల నెత్తిన తన అభీష్టాన్ని రుద్దడానికి ఆయన ఏనాడు ప్రయత్నించలేదు. బలవంత పద్ధతులుగాని, నిరంకుశ పద్ధతులుగాని ఎన్నడూ వుపయోగించలేదు.

''తనకన్నా దిగువ పదవిలో వున్నందున తనకు జవాబు చెప్పడానికి సాహసించ లేని ఎవరిపట్లనైనాసరే మొరటుగా వ్యవహరించడం అనేది నీచమైన విషయంగా, ఒక సోవియట్ పౌరునకు,

కమ్యూనిస్టుకు తగనిపనిగా "లెనిన్ భావించేవాని లెనిన్ కార్యదర్శి ఎల్.ఎ. ఫొతియెవా రాశారు.

లెనిన్‌కు ఆయన సహకార్యకర్తలకు మధ్య రాజకీయంగా గాని, నైతికంగా గాని ఏవిధమైన వివాదాస్నైనా చర్చించడానికి లేదా వాదించడానికి లేదా లెనిన్ అభిప్రాయంతో విబేధించడానికి ఎప్పుడూ వీలుండేది. తన వైఖరిని ఎకరీతిగా సమర్థించుకుంటూనే లెనిన్ ఆ ఆశయం రాజకీయ సారాన్ని ప్రాతిపదికగా చేసుకు ముందు కుసాగేవారు. అంతేతప్ప శృతిమించిన లక్ష్యాలు పెట్టుకున్నవారిలాగా తాత్కాలిక స్థితిగతులను పట్టుకు వేళ్ళాడేవారు కాదు. రాజకీయ వ్యవహారాలపై రచనలు చేసిన ఎం.ఎస్. ఓల్మిన్‌స్కీ యిలా రాశారు. సంభాషణల్లోగాని ఉత్తరాల్లోగాని తనపై దూషణపూర్వక వ్యాఖ్యలు ఎవరైనా చేసినా ఆయన వాటికి ఎలాటి ప్రాధాన్యతానిచ్చేవారు గాదు. సంభాషణలనుంచిగాని లేఖలనుంచి గాని రాజకీయాలకు సంబందించిన విషయాలను మాత్రమే ఆయన స్వీకరించేవారు. ఆవలి వ్యక్తి ఎంతటి పరుషపదాలను వాడినా ఆయన ఏమీ పట్టించుకునేవారు కాదు".

ఒక ప్రముఖ రాజకీయ వేత్త. దౌత్యాధికారి అయిన ఎ.ఎ.జోఫె రాసిన లేఖకు లెనిన్ ప్రతిస్పందించిన పద్ధతి ఎంతవిలక్షణ మైనదో యిక్కడ గుర్తు చేయడం సమంజసంగా వుంటుంది. ఏకారణం లేకుండానే కేంద్రకమిటీ తనను ఒక ఉద్యోగంలోంచి మరో వుద్యోగానికి బదిలీ చేస్తున్నదని ఆయన ఆ వుత్తరంలో ఫిర్యాదు చేశాడు. లెనిన్ వ్యక్తిగత అభిప్రాయాలే యితర విషయాలతోబాటు యీ విషయంలోకూడ కేంద్రకమిటీ నిర్ణయాలకు కారణమని ఆ వుత్తరంలో ఆయన ఆరోపించడం లెనిన్‌కు ఎంతోబాధ కల్గించింది. ఆ ఆరోపణలో నిజంలేదు. అంతే కాదు. అలాంటి దురభిప్రాయం ఏర్పరచుకోవడం పార్టీ ప్రమాణాలకు విరుద్ధం. అందువల్ల ఆ ఆరోపణకు ఆయన తీవ్ర అభ్యంతరం తెలిపారు. "పాత కేంద్రకమిటీ (1919-1920) అత్యంత ముఖ్య విషయాలలో ఒకదానిపై నన్ను ఓడించిన విషయం చర్చల సందర్భంలో మీకు తెలును ఆర్గనైజేషనల్ విషయాలలో అనేక విడివిడి విషయాలలో నేనెన్నోసారు మైనారిటీలో పడిపోయాను. ఆ విషయాన్ని కేంద్రకమిటీ సభ్యులుగా మీరు స్వయంగా అనేక సందర్భాలలో తప్పక చూసి వుంటారు. నేనే కేంద్ర కమిటీగా వ్యవహరించడం అనేది ఎలాటి అవకాశంలేని పూర్తి అసాధ్యమైన విషయం. అలాంటి. విషయాన్ని రాసేంతటి మానసిక బలహీనతకు మిమ్మల్నిమీరు అనుమతించుకోకూడదు.

అక్టోబరు విప్లవానంతరం దేశంలోని మొత్తం అధికారమంతా కార్మిక వర్గానికి చెందిన అగ్రగాములలో సాపేక్షంగా చిన్న బృందం చేతిలో కేంద్రీకరణపొందడం అనేది జరిగింది; సమాజాన్ని విప్లవాత్మకంగా పునర్నిర్మించడం అనే కృషిలోకి తేవాల్సి వుండిన కోట్లాది ప్రజలతో పోలిస్తే ఇది చాలా చిన్న బృందం. ప్రజలలో ఎప్పుడూ లేనంత పెద్ద సంఖ్యలో వారికి నాయకత్వం వహించి, అత్యంత కఠినమైన చరిత్రాత్మక పరీక్షలను ఎదుర్కొంటున్న సమయంలో ఆ ప్రజారాసి విశ్వాసాన్ని తోడ్పాటును పొందడం అనేది యీ చిన్న బృందం చేయగల్గిందీ అంటే వారి నైతికతతోసహా ఆత్మగతమైన పాత్రవల్లే సాధ్యమైందని ఆ రోజుల్లో యీ ఘటనలను పరిశీలిస్తున్న విదేశీయులు, వారు కమ్యూనిష్టులైనా కమ్యూనిస్టు రాజకీయ భావాలకు దూరంగా వున్న వారైనా అందరూ యిదే విధమైన నిర్ధారణలకు వచ్చారు.

"ఇంతటి నిస్వార్థపరుడైన మహా నాయకుడు మానవాళిలో యింతవరకూ పుట్టలేదు" అన్నారు రోమారోలా. "కమ్యూనిస్టుపార్టీకి వ్యతిరేకంగా నిలిచే ఏ శక్తి కన్నా కూడా నైతికంగా వున్నతమైంది కమ్యూనిస్టుపార్టీ" అన్నారు హెర్బర్ట్ వెల్స్.

## వ్యక్తుల యిష్టానిష్టాల ప్రభావం పడకూడదు

కమ్యూనిస్టుల అత్యంత విలువైన సాంప్రదాయాలలో ఒకటైన యిలాంటి సైద్ధాంతిక నైతిక సమన్వయత్వం అలవడాలంటే అది దానంతటదే జరిగిపోదు. విధానాలు రూపొందించేది రక్తమాంసాలున్న మనుషులు అందువల్ల చాలా సందర్భాలలో వారికి తెలియ కుండానే వారి వ్యక్తిగత వుద్దేశాలు తప్పకుండా అందులో వ్యక్తమవు

తాయి. యీ వాస్తవం నుంచి తలెత్తే అత్యంత జటిలమైన రాజకీయ నైతిక సమస్యను అధిగ మించక పోయినట్టయితే పైన పేర్కొన్న సమన్వ యతను సాధించజాలము.

ఒకే ఉమ్మడి ఆశయానికి అంకితమైన వారిలో కూడా వారి శక్తిసామర్థ్యాలు, జీవితాను భవం, దూరదృష్టి తదితర మేధా, నైతిక గుణగ ణాలలో తేడాలుంటాయి. అంతేకాదు జీవిత నిరంతర పురోగమనంలో ముందుకు వచ్చే, అటోయిటో పరిష్కారాలు అవసరమమే సైద్ధాంతిక ఆచరణాత్మక సమస్యల పట్ల వారు తీసుకునే. వైఖరులలో కూడా తేడాలుంటాయి.

జీవద్యంతమైన రాజకీయ ఉద్యమానికి అత్యంత ముఖ్యమైన లక్షణాలలో ఒకటి.

నైతికంగా వురడే తేడాలు, అభీష్టాలు, స్వభా వాలు, ప్రవర్తన తీరు తదితర వ్యక్తిగత గుణాలు మానవ సంబంధాలలో - అటు వ్యక్తిగతము, ఇటు వ్యవహార సంబంధమైనవీకూడా. ఎంతటి సంక్లిష్ట తలను, ఘర్షణలను తేగలుగుతాయో లెనిన్ స్వయంగా గ్రహించారు. అలాంటి వ్యక్తిగతమైన తేడాలు దైనందిన జీవితాన్ని సుసంపన్నం చేయడం మాత్రమే కాక దానికి అవరోధం కూడ కాగలవు. అంతర్ వ్యక్తి వైరుధ్యాలను ఘర్షణలను యిందులోనికి తేవడం వల్ల, నిర్వహించాల్సివున్న వ్యవహారం పై ఆ ప్రభావం తప్పకపడుతుంద. సమాజాన్ని సోషలిస్టు పునర్నిర్మాణం చివరకు కమ్యూనిస్టు పునర్ నిర్మాణం చేసినా ప్రజల సామాజిక హోదాలో అసమానతలు అంతంఅవు తాయి అంతేతప్ప శక్తిసామర్థాల (దైహిక, మేధా) విషయంలో సమానత్వం అనే దృష్టిలో మానవ సమానత్వాన్ని" అది స్థాపించ జాలదు అని లెనిన్ భావించారు. అంతేకాదు సామాజిక హోదాలో

> లెనిన్‌లో ప్రత్యేకించి మహత్తర మైనదిగా నేను పరిగణించే విషయం...... ప్రజలకేర్పడిన దుర దృష్ట స్థితులను సహించడానికి రాజీ లేని విధంగా తిరుగులేని విధంగా ఆయన తిరస్కరణ; దురదృష్టం అనేది తొలగించరానిది ఎంత మాత్రం కాదు, ప్రజలు తిరస్కరించ గల, తిరస్కరించి తీరాల్సిన దుస్స హనీయ విషయం అన్న ఆయన దృఢవిశ్వాసం.
>
> -- మాక్సిం గోర్కీ

అతి ముఖ్యా అంశాలలో ఒకేవిధంగా ఆలోచించే వారు సైతం రాజకీయ పరిస్థితిపై అభిప్రాయాలు ఒక నిర్దిష్ట రాజకీయ వ్యూహం ఎత్తుగడలు ఎంచుకోవడంలో భిన్నత్వా న్ని తప్పించుకోజాలరు. సార్వత్రిక తరహాకు చెందిన రాజకీయ భావాల ను సిద్ధాంతాలను వాస్తవా చరణలో అమలు జరప డం అంటే ముందుగా వూహించడం వీలుండని అనేక నిర్దిష్ట పరిస్థితులను అధిగ మించడం అని అర్థం. అందుకు రాజకీయ వైఖరులలో, పరిష్కారాలలో తగిన విధంగా మార్పు లు అవసరమవుతాయి. ఈ స్థితిగతులను గురించి అలాగే మొత్తం పై నిరంతరం మార్పు చెందే చారిత్రక పరిస్థితిని గురించి ఆ వుద్యమంలోని సభ్యులందరికీ ఒకే విధమైన అంచనా వుండక పోవచ్చు. యిది సహజమే. ఈ సమస్యలపై భిన్నా భిప్రాయాలు, వాటిని పరిశీలించడం, సైద్ధాంతిక వివాదాల ఘర్షణ, చర్చలు యివన్నీ సరైన రాజకీయ నిర్ణయాలను ఎంచుకోడానికి వాటిని ఆమోదించడానికి తప్పనిసరి షరతు. భిన్నాభిప్రా యాలు తరచు పరస్పర విరుద్ధాభిప్రాయాలను స్వేచ్ఛగా వ్యక్తపర్చుకొనే అవకాశం అన్నది ఒక

తేడాలవల్ల జరిగే "పీడన"ను మాత్రమే అది రద్దుచేస్తుంది దానితో సంబంధం లేకుండా "బల హీనమైన స్వభావం గలవారిపై బలమైన స్వభావం" గల వారి పై చేయికి సంబంధించిన కొన్నిరకాల "పీడనను" యీవిధమైన సమాజ పునర్నిర్మాణాలు సైతం రద్దు చేయజాలవు అని లెనిన్ భావించారు. వ్యక్తిగత, కామ్రేడ్‌పరమైన లేదా కుటుంబ సంబంధాలలో వ్యక్తమవుతు, నైతిక విలక్షణతల వల్ల ఉద్భూతమయ్యే ఆవిధమైన పీడనల" ను బయటి జోక్యంతో తొలగించడం సాధ్యంకాదు.

ఆవిధమైన "పీడనను" వదిలించుకోవాలా

వద్దా అనేది స్వచ్ఛందంగా విభజించుకున్న పాత్రల ఆధారంగా నాయకత్వం, నాయకత్వానికి లొంగివుండడం అనే సంబంధాలలోకి ప్రవేశిం చేవ్యక్తి తేల్చుకోవల్సిన స్వవిషయం. అలాంటి సందర్భాలలో అవమానం స్వాభిమానానికి నష్టం అనే భావాలు లేకుండా ఒక వ్యక్తి మరోవ్యక్తిని "నాయకున్నిగా" ను తాను "అనుచరుని"గా గుర్తించవచ్చు. అయితే ప్రైవేటు జీవితంలోగాని, కేవలం ప్రైవేటు మానవ సంబంధాలలోగాని పూర్తిగా వ్యక్తిగత ఎంపిక ఆధారంగా ఏర్పాటు చెనుకున్న సంబంధాలలో "బలమైన స్వభావం" గలవారు యితరులపై తమ అభిప్రాన్ని అభిరు చులను లేదా అలవాట్ల నురుద్దడానికి ప్రయత్నిస్తే దానివల్ల ఘర్షణలు పుట్టి వచ్చు. సమాజం ఎంతటి న్యాయమైన ప్రాతిపదికగా నిర్మితమైనదైనప్పటికీ వీటిని తప్పించలేకపోవచ్చును.

సమాజాన్ని నాయకులు అనుచరులు, పాలకులు పాలితులుగా విభజించేసామాజిక జీవిత రంగా లలో ప్రజల వ్యక్తిగత నైతిక వ్యత్యాసాలు వ్యక్తమై నపుడు అవి రాజకీయ అధికారానికి చెందిన సంబంధాలలో వ్యక్తమైనపుడు దీనికి మరింత ప్రాముఖ్యత ఏర్పడుతుంది. ఇతరులపై అధికారం లభించిన వ్యక్తి బలమైన స్వభావం గలిగి వున్నట్ట యితే అతడు ఆశక్తిని యితరుల అభిప్రాలు గౌరవాలు స్వేచ్ఛలను అణచివేయడానికి ఉపయో గించినపుడు యిలాంటి సమస్యలు తలెత్తుతాయి. నిరంకుశత్వం, నియంతృత్వం, అధికార దుర్విని యోగం, యితరుల అభిప్రాయాలను లెక్కచేయక పోవడం, తన అభిప్రాయాలు అలవాట్లు అభిరు చులను అందరూ గుర్తించి వాటినే అలవర్చుకో వాలని ఉత్తర్వుల ద్వారా రుద్దడం వీటన్నిటి సామాజిక, మనస్తత్వకారణాలు యిందులోనే గర్భి తమై వున్నాయి.

## నిరంకుశాధికార పద్ధతుల పట్ల వ్యతిరేకత

సరైన పంథాను అవలంబించిన వారు. అత్యు త్తమ రాజకీయ, కార్యనిర్వాహణా సామర్థ్యాలూ గలవారూ సైతం మానవబలహీనతలకు, పొర పాట్లకు అతీతులు కారని లెనిన్ గ్రహించారు. అయితే వ్యక్తుల ప్రయివేటు జీవిత విషయాలు సామాజికంగా ఎంతో అవసరమైతే తప్ప వాటిని బహిరంగ చర్చకు పెట్టకుండా లెనిన్ జాగ్రత్త తీసుకునేవారు. అయితే ఒక వ్యక్తికి గల ప్రతికూల స్వభావ లక్షణాలు సామాజికంగానూ పార్టీ భవిష్య త్తుకూ ప్రమాదకర పర్యవసానాలు తేగలవని లెనిన్ నొక్కి చెప్పారు. తాను ఎంతగానో ప్రేమించే వ్యక్తి ప్లెఖనోవ్‌తో తన ఘర్షణను గురించిన వ్యాసంలో ఆయన యీ విషయం వివరించారు. ఆ తరువాత 25 సంవత్సరాలకు "మహాసభకు లేఖ" లో, అనంతరం అనేక లేఖలు, వ్యాసాలలో యిదే భావాన్ని తిరిగి వివరించారు. "కేవలం వ్యక్తిగత తరహా" విష యాలు పార్టీ ఐక్యత సుస్థి రతలకు ప్రమాదం కలిగించే ప్రమాదాన్ని తప్పించాలని అందులో ఆయన నొక్కి చెప్పారు. పార్టీ 12 వ మహాసభకు ముందే లెనిన్ అనేక వ్యాసాలు, లేఖలు డిక్టేట్ చేసి రాయించారు. 1923 ఏప్రిల్‌లో యీ మహాసభ జరగడానికి ముందే యీ వ్యాసాలు కొన్ని ప్రచురితం అయ్యాయి. "మహాసభకు లేఖ అనే పత్రాన్ని ఎలా వినియో గించాలో ఆయన ఆరోగ్యం విషమించడం వల్ల సూచించ లేక పోయారు. లెనిన్ మరణాం తరం జరిగిన పార్టీ 13 వ మహాసభ దృష్టికి కృపస్కయా ఆ విషయం తెచ్చారు. 12 వ మహా సభకు తాను అనారోగ్యంవల్ల వెళ్లలేక పోవచ్చునని ఆయన భావించారు. కేంద్ర కమిటీ సుస్థిరతను దృఢత రం చేసేందుకు స్వరూప సంబంధ మార్పులు చేయాల్సిందిగా పార్టీ అత్యున్నత వేదిక అయిన మహాసభకు లెనిన్ ఆ లేఖలో విజ్ఞప్తి చేశారు. తక్షణ భవిష్యత్తులో చీలికను నిరారించేందుకు చర్యలు తీసుకోవాలని ఆయన కోరారు.

పార్టీ నాయకత్వంలో, ప్రభుత్వంలో, కీలక పదవు లలో వున్నవారి అనుకూల ప్రతికూల లక్షణాలను గురించి తన అభిప్రాయాన్ని పార్టీ మహాసభ తెలుసుకోవాలని ఆయన భావించారు. ప్రధాన కార్యదర్శి పదవి నుంచి స్టాలిన్‌ను తప్పించివేరే వ్యక్తిని నియమించాలని లెనిన్ సూచించారు. 'మరింత సహనం, విధేయత, మృదుత్వం, కామ్రేడ్స్ పట్ల శ్రద్ధ వుండి అనూహ్యామార్పులు తక్కువగా వుండే వ్యక్తిని" ఆ స్థానంలో పెట్టాలని ఆయన సూచించారు.

ప్రభుత్వ ప్రణాళికా కమిషన్‌కు చట్టపరమయిన

నిధులను మంజూరు చేసే విషయమై లేఖలో ఆ కమిషన్ బాధ్యులపై వస్తున్న దాడులను ప్రస్తావిస్తూ కూడా ''వ్యక్తి లక్షణాలను'' గురించి లెనిన్ చర్చించారు.

## ప్రజాస్వామ్యానికి రాజకీయ హామీలు

కేవలం వ్యక్తిగత విషయాలు, కాకతాళీయ, ఘటనలు లేదా నాయకుల ప్రతికూల స్వభావాలు,

కేంద్ర కమిటీ సభ్యుల సంఖ్యను బాగా పెంచాలని ఆయన సూచించారు. ''కార్మికులకు, రైతులకు సన్నిహితంగా వుండే'', కార్మిక వర్గ సభ్యులను కేంద్ర కమిటీలో వేయాలని సూచించారు. ''నిజమయిన సోషలిస్టు, సోవియట్ నూతన రాజ్య యంత్రాంగాన్ని నిర్మించేందుకూ'', సోషలిజం కోసం పోరాటంలో నిమగ్నమైన. ''అగ్రగామి కార్మికులను, విద్యా శిక్షణ, పరిజ్ఞానం గలవారిని, ఆదర్శానికి త్రికరణ శుద్ధిగా కట్టుబడివున్నవారిని

**సామూహికంగా ప్రజలు ఆరాధ్యంగా కొలిచేందుకు అంతటి ఆకర్షణలేవీ ఆయనలో లేవు. అయినా చరిత్రలో బహుశా అతి కొద్దిమంది మాత్రమే ప్రజల ప్రేమ గౌరవాలను అంతటి స్థాయిలో పొంది వుంటారు. అంతటి ప్రజాదరణ పొందిన యీ అపూర్వ నాయకుడు, కేవలం మేధాశక్తి సుగుణంవల్లే అంతటి నాయకుడయ్యాడు. అందచందాలు, హాస్య భాషణలు వున్నవాడు కాదు; రాజీ ఎరుగడు; నిష్పక్షపాతి; ఆకర్షించే విచిత్ర చేష్టలు లేవు — అయితే గంభీరమయిన భావాలను చిన్న మాటలలో వ్యక్తం చేయగల శక్తి, ఒక నిర్దిష్ట పరిస్థితిని విశ్లేషించగల శక్తి ఆయనకుంది; దాన్ని ఎంతో చాకచక్యంగా చేస్తారు. మహత్తర సాహసమే ధావి.**

**- జాన్‌రీడ్ (అమెరికన్ పాత్రికేయుడు)**

వ్యక్తుల మధ్య విభేదాలు పార్టీ భవిష్యత్తుకు హాని కలిగించకుండా వాటి ప్రభావం తగ్గించగల రాజకీయ హామీల వ్యవస్థను రూపొందించడం లెనిన్ తుది రచనలలోని ఒక ముఖ్యాంశం. అందుకు ''రాజకీయ నిర్మాణ స్వరూపంలో'' మార్పులను ఆయన సూచించారు. అధికారం కొద్ది మంది నాయకుల చేతుల్లో అధికంగా కేంద్రీకృతం కాకుండా చేసేందుకు, పార్టీ అదుపు వుండేందుకు వుద్దేశించిన మార్పులివి.

ఆశయ సాధనకు ఎలాటి నష్టాల నెదుర్కొనడానికైనా వెనుదీయని వారిని బాధ్యతాయుత స్థానాలలో నియమించాలని ''తక్కువే మేలు, కాని మేలుగా వుండాల'' అన్న వ్యాసంలో లెనిన్ పేర్కొన్నారు.

ఏ రకమయిన బ్యూరాక్రాటిక్ పద్ధతులు నిరంకుశ పద్ధతులు రాకుండా నివారించడానికి యిది బలంగా తోడ్పడగలదని లెనిన్ భావించారు.

# శాస్త్ర, సాంకేతిక రంగం

రోదసీ శాస్త్ర సిద్ధాంత నిర్మాతగా కన్‌స్తన్‌తీన్ తియెల్కోవ్‌స్కీ సేవలు సార్వత్రిక గుర్తింపు పొంది నవి. యీ ప్రముఖ శాస్త్రజ్ఞుని తాత్విక భావనలు అంతగా ప్రాచుర్యం పొందలేదు. విశ్వం పరిణామ నమూనాను ఆయన రూపొందించి అందులో మానవుని పాత్రను విశదీకరించాడు. యీ భావనల పాత్రను తన శాస్త్రీయ గ్రంథంలో యిలా విశదీ కరించాడు: "నేను రాకెట్‌ను గురించే చెవుతున్నా నని చాలామంది అనుకుంటున్నారు. యిది పొరపా టు అభిప్రాయం. రాకెట్లు రోదసిలో ప్రవేశించడా నికి సాధనాలు మాత్రమే. అవే పరమ లక్ష్యం కావు.... మానవుడు భూమి నుండి వెళ్లి రోదసిలో నివాసం ఏర్పరచుకోవడమనేది అసలు విషయం. చెప్పాలంటే మనం రోదసీ సిద్ధాంతం కోసం కృషి రూపం, "కిరణ" శక్తి రూపం - పలు మార్పులు చెంది విశ్వంగా పరిణమించిందని త్సియెల్కోవ్‌స్కీ అభిప్రాయం. దీన్ని సరళం నుండి సంక్లిష్టమైన ఒక చక్రీయ పరిణామక్రమంగా ఆయన దర్శించా డు. ప్రతిఒక్క జీవిత చక్రంలోపదార్థం వుద్భవి స్తుంది, అభివృద్ధి చెందుతుంది, తిరిగి జన్మించడా నికి అంతమైపోయింది.

"పరిణామక్రమంలోని ఒక వస్తువుగా మానవాళి కూడా మారుతుంది. బిలియన్ల సంవత్సరాల తర్వాత అది ఒకే ఒక రకమైన శక్తి కిరణంగా మారుతుంది. మొత్తం బాహ్య రోదసిని నింపివేసే ఏకైక భావన అది....." అని ఆయనంటారు.

పదార్థ చక్రీయ పరిణామం ప్రగతి శీలంగా వుండాలంటే; పదార్థవు గత కార్యకలాపాల జాడలు

# కన్‌స్తన్‌తీన్ త్సియెల్కోవ్‌స్కీ

## రోదసీ సిద్ధాంతం

# మానవుని ఆకాంక్ష

కన్‌స్తంతీన్ త్సియెల్కోవ్‌స్కీ

"మానవుని ఆకాంక్ష" అనే పుస్తకాన్ని కన్‌స్తంతీన్ త్సియెల్కోవ్‌స్కీ 1928లో రాశాడు. విప్లవానికి చాలా కాలం ముందే ఆయన అంతరిక్షయాత్రా సూత్రాన్ని రూపొందించాడు. ఆ తర్వాత అంతరిక్షసాంకేతిజ్ఞత భవితవ్యాన్ని గురించి ఆలోచించాడు. సాంకేతిక పరమైన అంశం నుండి విశ్వం, అందులో మానవుని పాత్ర అనే అంశానికి ఆయన ఆలోచనలు మారాయి.

మానవుణ్ణి భూమికి సంబంధించిన వానిగానే గాక మొత్తం విశ్వానికి సంబంధించిన వ్యక్తిగా ఈ అంతరిక్ష సిద్ధాంతం విశదీకరిస్తుంది. మానవుడు యిప్పటికే అంతరిక్షంలో నివాసమేర్పరుచుకున్నాడు. 200మందికి పైగా యిప్పటికే అంతరిక్ష యాత్రలు చేశారు.

ఈ పుస్తకంలోని ఒక భాగాన్ని యిక్కడ యిస్తున్నాం. మానవుడు విశ్వాన్ని తననివాసంగా చేసుకోగలడనే అభిప్రాయాన్ని రచయిత వ్యక్తం చేశాడు. విశ్వం సంకల్పమే, అది సృష్టించిన మానవుని సంకల్పం. యీయన యితర రచనల్లోని మార్మికవాదంలాంటిది యిందులో లేదు. గుడ్డినమ్మకాలను ప్రధానంగా ఆలోచనలో, ఆచరణలో సోమరితనాన్ని మన కోసం మానవాతీత శక్తులు సమస్తం సమకూర్చుతాయనే నమ్మకాన్ని ఆయన ఖండించారు.

భూమ్మీదా, అంతరిక్షంలో నివసించే మానవుల మధ్య సహజమైన సంఘీ భావాన్ని స్నేహాన్ని గురించి యీ పుస్తకం వివరిస్తుంది. విశ్వంలోని మానవ సమాజాలను "సురగోళాల సమాఖ్య" వివేచనా శీలురైన అధ్యక్షులు పాలిస్తారని ఆయన వెల్లడించిన అభిప్రాయం ఒక విధంగా అహ్లాదకరమైనది. యిది ఆయన రేఖాచిత్రం. యీ విధంగా విశ్వం వివేకవంతమైనదిగా, విజయవంతంగా పరిణమించే చిత్రాన్ని ఆయన వూహించారు. నక్షత్ర యుద్ధాలకోసం సన్నాహాలు చేసేవారికి యింగిత జ్ఞానమున్నట్టు ఆయన పేర్కొని వుండేవాడు కాదనేది నిస్సందేహం.

మన సౌరవ్యవస్థలో వెయ్యికిపైగా గ్రహాలున్నాయి. జీవరాశి అత్యంత మేధా సమన్వితంగా రూపొందడానికి అనువైన పరిస్థితులుగల గ్రహం కనీసం ఒకటి ఉంటుంది. మన సౌరవ్యవస్థ లాంటి బిలియన్‌కు పైగా సౌరవ్యవస్థలు మన పాలపుంతలో ఉన్నాయి. విశ్వంలో యిలాంటి పాలపుంతలు సుమారు మిలియన్‌కు పైగా ఉన్నాయి. యిలాంటి విశ్వాలు అనంతకోటి. అందువల్ల మన విశ్వానికే మనం పరిమితమై చూద్దాం. యిందులో బిలియన్ల సౌరవ్యవస్థలు కొన్ని మిలియన్ల సంఖ్యలో వున్నాయి. జీవరాశి అన్ని గ్రహాల్లో ప్రభవించింది, కాని అది పరిపూర్ణంగా అభివృద్ధి చెంద

డానికి అన్ని గ్రహాల్లోని పరిస్థితులు ఒకే విధంగా లేవు.

తన సౌరవ్యవస్థలోని, యితర సౌర వ్యవస్థల్లోని అన్ని గ్రహాలపై కాలూనాలని మానవుడు కలలు గంటున్నాడు. పరిపూర్ణంగాలేని ప్రతిఒక్క జీవిని నిర్మూ లించి అన్ని గ్రహాలపై తన నిర్దుష్ట సంతతిని పాదుగొల్పాలని అతని లక్ష్యం.

భవిష్యత్తు మానవుడు యిలా అనుకుంటాడు: భూమిపైగల జీవరాశి యెన్ని కఠిన పరీక్షలకు, యిబ్బందులకు లోనైంది! యిప్పుడు అవన్నీ గతకాలపు విషయాలయ్యాయి. జీవితం సహేతుకమైన రూపాలను సంతరించుకుంది. ప్రారంభం నుండే పరిపూర్ణ మానవులు భూమ్మీద వుండి వుంటే, యింతటి యిబ్బందులకు, వున్మాదభరిత చర్యలకు మానవాళి గురయ్యేదికాదు.

మానవుడు యిలా ఆలోచిస్తే, యితర గ్రహాల్లోని తెలివైనవారు కూడా అలాగే ఆలోచించడం సహజమే; తమ సంతతిని పెంపొందించుకోడానికి వారు కూడా యితర గ్రహాలపైగల అపరిపూర్ణ జీవులను తోటలోని కలుపు మొక్కలను పీకివేసినట్టు నిర్మూలించి తమ సంతతిని అక్కడ వృద్ధిచేసుకుంటారు.

ఈ విధంగా విశ్వమంతా పరిపూర్ణ మానవులతో నిండి పోతుంది. అనేక గ్రహాలపై బాగా అభివృద్ధి చెందిన మానవ సమాజాలు త్వరగానే నెలకొంటాయి. మిలియన్ల బిలియన్ల సంఖ్యలో గల గ్రహాల్లో కొన్నిటిలో మాత్రమే పరిపూర్ణ మానవుడు రూపుగొనడానికి సహస్రాబ్దాలు పడుతుంది.

అంతటా యింగిత జ్ఞానం పై చేయి సాధిస్తుంది. కాని ఒక సెకండులోనే మన సంతోషాన్ని తుడిచి పెట్టగల ప్రకృతి వైపరీత్యాల మాటేమిటని మీరడగవచ్చు.

గ్రహాలు నురగోళాలు బాంబుల్లాగా పేలుతాయి. వీటిని తట్టుకొని జీవులు మనలేవు. నురగోళాలు చల్లబడిపోతాయి. అవితమ గ్రహాలకు ప్రాణాధారమైన వెలుతురును యివ్వలేవు. అప్పుడు గ్రహాలపై గల వారంతా యీ విపత్తును తప్పించుకోగలరా? యిప్పటికి మానవులు యెన్నో యిబ్బందులను తట్టుకొని నిలిచారు, విపత్తులను తప్పించుకొన్నారు. యిక ముందు కూడా తప్పించుకోగలరు.

అత్యంత మేధావులైన భావి మానవులను మనం తక్కువ అంచనా వేస్తున్నాం. యిప్పుడు మానవుడు ప్రమాదాలను ముందుగా పసి గడుతున్నాడు. దానినుండి తప్పించుకునేందుకు తగుచర్యలను తీసుకుంటున్నాడు. అప్పుడప్పుడు వాటిని ప్రతిఘటిస్తున్నాడుకూడా. భావి మానవుని ప్రతిఘటన యెంతో శక్తివంతంగా ఉంటుంది.

గ్రహాలపేలుళ్లను వారు కొన్ని వందల సంవత్సరాలు ముందుగానే పసిగట్టగలరు. వాటిని వదిలి బాహ్యాంతరిక్షంలో సురక్షిత ప్రాంతాలకు చేరుకుంటారు. సురగోళాలపేలుళ్లను, అవి చల్లబడిపోయే సందర్భాలను కూడా ముందుగానే పసిగట్టి వాటి తాలూకు గ్రహాలను వదిలివెళ్లిపోతారు

నేడో, రేపో సురగోళాలన్నీ చల్లబడిపోయి జీవకోటి నశిస్తుందని మీరనవచ్చు. అన్ని సురగోళాలు ఒకే సారిచల్లబడవు. కొన్ని సురగోళాలు చల్లబడిపోతుంటాయి. అంత కన్నా తరుచుగా మరికొన్ని సురగోళాలు తిరిగి పుంజుకుంటాయి. మొత్తంమీద విశ్వం దాదాపు యిలాగే వుంటుంది. ప్రతిఒక్క సురగోళం చల్లబడుతుంది, మళ్లీ ప్రకాశవంత మౌతుంది.

యిలా అనేకసార్లు జరుగుతుంది. యీ విషయాన్ని నేను ఎన్నోసార్లు రుజువు పర్చాను. జీవులు, వాటి అంతర్భాగంగా ఉన్న పరమాణువులు నశిస్తూనే వుంటాయి. తిరిగి అవతరిస్తూనే వుంటాయి.

విశ్వం, అలాగే జీవరాశి అమరమైనది. మన విశ్వానికి గల సంకల్పం వుత్తమమైనదని అంటున్నాం. దాని ఆశయమేదైనా వుంటే ఆ ఆశయానికి సార్వజనీన ప్రేమకు వుండే లక్షణాలేవుంటాయి. యేదో ఒకరోజు భూమ్మీది జనమంతా యేకమై ఒక కౌన్సిల్‌ను ఎన్నుకుంటుంది. ఆ కౌన్సిల్ ఒక ఛైర్మన్‌ను ఎన్నుకుని అయన నాయకత్వాన పరిపాలన చేస్తుంది. తర్వాత మన సౌరవ్యవస్థ జనాభాతో నిండిపో యిన తర్వాత యిలాంటి పరిపాలనా వ్యవస్థే యేర్పడుతుంది.

తర్వాత ఇతరగ్రహాలు, సౌరవ్యవస్థలు కూడా యేకమౌతాయి. బాగా అభివృద్ధి చెందిన తరం అక్కడ స్థిరనివాసమేర్పరుచుకొని వెంటనే తమ ప్రభుత్వాన్ని నెలకొల్పుకుంటుంది. కాగా యిందుకోసం మన భూమి, సౌరవ్యవస్థ యిప్పుడు అష్టకష్టాలతో నిండిన సుదీర్ఘక్రమంగుండా సాగుతోంది.

యిలా ఐక్యంకావడం అవసరం. యెందుకంటే దీనివల్ల ప్రాణికోటికే ప్రయోజనం. అవి పరిణతి చెందినవైతే సహేతుకంగా వ్యవహరిస్తాయి, తమ ప్రయోజనాలకు భిన్నంగా వ్యవహరించవు. అపరిపూర్ణం అంటే అరాచకం, అరిష్టం.

సురగోళాల బృందాలు, మొత్తం పాలపుంత యీ విధంగా ఛైర్మన్ల ద్వారా ఐక్యమౌతుంది. ఇది ఒక బలవత్తరమైన వివేకవంతమైన సంస్థగా వుండగలదు.

**సోవియట్ విజ్ఞాన శాస్త్రాల అకాడమీ కరెస్పాండింగ్ సభ్యుడూ, జియోకెమిస్ట్రీ, అనాలిటికల్ కెమిస్ట్రీ తాలూకు వెర్నాడ్ స్కీ ఇనిస్టిట్యూట్ డైరెక్టరూ అయిన వి. బార్సుకోవ్‌తో ఇజ్వెస్తియా ఇంటర్వ్యూ.**

**ఈనాడు అంతరిక్ష శాస్త్రం కుజగ్రహం పట్ల అమిత శ్రద్ధ కనబరుస్తున్నది, ఎందుకు?**

కుజగ్రహ ద్రవ్యరాశిని, యితర లక్షణాలను బట్టి చూస్తే భూమికి, దీనికీ పోలికలున్నట్టు విశదమౌతోంది. యిది వేడిగా వున్నప్పుడు, దీనిపై నీరు, నదులు ఉన్నప్పుడు సరళజీవులు వుండేవనే అభిప్రాయం యీ గ్రహంపట్ల ఆసక్తిని పెంచుతోంది. యిప్పుడు అక్కడ జీవులున్నాయో, లేవో చెప్పలేము.

అక్కడ జీవులు లేవని అమెరికన్ వైకింగ్‌లు రెండు జరిపిన పరిశోధనలు తెలియజేస్తున్నాయి. దీన్ని నమ్మలేము. ఎందుకంటే ఆ పరిశోధనలు ఒక పద్ధతి ప్రకారం జరగలేదు పైగా సరళజీవులు ఉపరితలంపైనే వుండవు. అంటార్కిటిక్‌లో జీవరాశి లేదని తొలుత అన్నారు. కుజ గ్రహంపై గల పరిస్థితులకు పోలిన అంటార్కిటిక్‌లో జీవరాశిని కనుగొన్నారు. అందువల్ల కుజునిపై కూడా జీవరాశి ఉండవచ్చు. కుజ గ్రహం ఉపరితలం మట్టిని అధునాతన శాస్త్రీయ పద్ధతుల్లో పరిశీలిస్తేనే అసలు విషయం తెలుస్తుంది.

**అందుకు సోవియట్ పథకా లేమిటి? అవి అమెరికా పథకాలకు భిన్నంగా వుంటాయా?**

1990ల ప్రారంభంలో మనమూ అమెరికా ప్రయోగించే వుపగ్రహాలు



# కుజగ్రహ యాత్ర

కుజుని చుట్టూ పరిభ్రమిస్తాయి. అవి ఈ గ్రహాన్ని సునిశితంగా పరిశీలిస్తాయి. అందుకు కావాల్సిన పరికరాలను గురించి, కుజునిపై వుపగ్రహాల అవరోహణ ఒకదశలోనే జరగాలా లేక రెండు దశల్లో జరగాలా అనే విషయాన్ని గురించి ఆలోచిస్తున్నాం.

మొదటి వైకింగు దిగిన ప్రాంతానికి 4,000కిలో మీటర్ల దూరంలో రెండవ వైకింగు దిగింది. యివి సేకరించిన సమాచారం ఒకే విధంగా వుంది. యీ



సోవియట్ అంతరిక్ష పరిశోధక నౌక తీసిన కుజగ్రహ వుపరితల ఫొటోలు.

గ్రహంపై నాలుగు నెలలపాటు (కుజ గ్రహానికి ఇది రెండు నెలలతో సమానం) ధూళి తుఫాన్ వీస్తుంది. యిది గ్రహంపై మిట్ట పల్లాలు లేకుండా చదును చేస్తుంది.

మన వుపగ్రహాలు కుజగ్రహంపై కిలో మీటర్ ఎత్తున పరిభ్రమిస్తూ ధూళిపొర మందాన్ని, ఒక మీటర్ కన్నా తక్కువ లోతులో శిలలు వున్న ప్రదేశాన్ని కను గొంటాయి. యీ గ్రహంపైగల మంచు పొర స్వభావాన్ని కూడా తెలును కుంటా యి. యీ గ్రహంపై కృత్రిమ వుపగ్రహాల ను యెక్కడదించితే ప్రయోజన కరంగా ఉంటుందో తెలుసుకోడానికి యీ వివరా' లు అవసరం.

**మాస్కో అంతరిక్ష ఫోరం, ఆ తర్వాత బ్రైట్టన్‌లో జరిగిన ఇంటర్‌నేషనల్ అస్ట్రోనాటికల్ ఫెడరేషన్ సమావేశం (ఐ.ఎ.ఎఫ్) శుక్రగ్రహంపై ప్రయోగించిన వాతావరణ బెలూన్ల ప్రయోజనాన్ని చర్చించాయి కదా?**

అవును. చర్చించాయి. కాని కుజునిపై ప్రయోగించే వాతావరణ బెలూన్లు మరో విధంగా ఉంటాయి. శుక్రగ్రహంపై గల గాలి వాటిని చాలా ఎత్తుకు తీసుకెళ్లింది. కాగా కుజగ్రహంపై ప్రయోగించే బెలూన్లను దానిపై గల వాతావరణం నిర్దేశించిన ఎత్తుకు తీసుకెళ్లుతుంది. రాత్రి సమయా ల్లో అవి ఆ గ్రహంపై దిగుతాయి.

దీనివల్ల ఒకేసారి మూడు సమస్యలు పరిష్కార మౌతాయి. శుక్రగ్రహంపై లాగానే యీబెలూన్లలోని వాతావరణ పరికరం వాతావరణాన్ని పరిశీలిస్తుంది.

యీబెలూన్లు, పైకి ఎగిరేటప్పుడు, దిగేటప్పుడు అందులో చిన్న .టి.వి. కెమెరాలు కుజగ్రహ వుపరితల ఫొటోలను చాలా చక్కగా తీస్తాయి. ఉపగ్రహం యిలాంటి చిత్రాలను తీయలేదు.

**ఆ తర్వాతి దశలో కుజునిపై వుపగ్రహాన్ని దించుతారు కదా? దాన్ని యే ప్రాంతంలో దించాలని ఉంది? శాస్త్రజ్ఞులు ఎలాంటి పరిశోధనలు జరువ దల్చారు?**

తర్వాతి దశలన్నీ కుజగ్రహంపై దిగడానికి వుద్దేశించినవే. ఏ ప్రాంతాల్లో వుపగ్రహాలను దించాలో మన శాస్త్రజ్ఞులు, అమెరికన్లు పరిశీలిస్తున్నారు. కుజగ్రహంపై గల అతి ప్రాచీన వుపరితలం వట్ల, దాని ధృవాలవట్ల, ఒకప్పుడు దానిపైగల నదుల-లోయల వట్ల మనకు ఆసక్తి వుంది. వీటి పరిశీలనలవల్ల అక్కడ సూక్ష్మజీవుల వునికి గురించి తెలుస్తుంది. అక్కడ అగ్ని పర్వతాల లావా పరిశీలన వల్ల గ్రహగర్భంలోని పరిస్థితి తెలుస్తుంది. ఇందుకు యెంతో కృషి అవసరం. అధునాతన పరిశోధనా పరికరాలను, నమూనాల సేకరణ పరికరాలను అమర్చిన కుజగ్రహ మాడ్యూల్ మనకు అవసరం.

**కుజగ్రహంనుండి తెచ్చిన మట్టి మచ్చులను యిక్కడొ పరిశీలిస్తారు కదా? అందులో సూక్ష్మజీవులు వుండవచ్చునని మీరిదివరకే చెప్పారు. అవి ఎయిడ్స్ కన్నా ఘోరమైన వ్యాధిని వ్యాపింవ జేస్తాయేమో?**

అన్ని ముందు జాగ్రత్త చర్యలు. తీసుకుంటాం. కుజగ్రహం నుండి మచ్చులను తెచ్చే రాకెట్‌ను భూ నమీప కక్ష్యవద్ద నిలిపివేసి అక్కడ ప్రాధమిక పరిశీనలు జరుపుతారు యీ మచ్చుల వల్ల యెలాంటి ప్రమాదం లేదని శాస్త్రజ్ఞులకు పూర్తి నమ్మకం కుదిరిన తర్వాతే వాటిని భూమ్మీదికి తీసుకువస్తారు.

**ఈ పథకాలు యెంతో సంక్లిష్టమైనవి, ఖర్చులతో కూడుకొన్నవి. యిందులో అంతర్జాతీయ సహకారం ఎంతవరకు సాధ్యం? సోవియట్ యూనియన్, అమెరికాలు సహకరించుకొంటాయా?**

దాదాపు ఈనాటి అంతరిక్ష కార్యకలాపాలన్నిటికి విస్తృత అంతర్జాతీయ సహకారం అవసరం. కుజగ్రహ పరిశోధనకు కూడా యిది అవసరం. యిందుకు నన్నద్ధంగా మనం యిప్పుడు సోషలిస్టు దేశాలు, ఫ్రాన్స్, ఆస్ట్రియా, యితర దేశాలతో కలిసి పనిచేస్తున్నాం. కొద్దిపాటి నంయుక్త నమన్వయంతో అమెరికా తన కార్యక్రమాన్ని వేరే రూపొందించు కుంటోంది. ఉభయదేశాల మధ్య ప్రస్తుత రాజకీయ నంబంధాలు, యీ విషయంలో కొద్దోగొప్పో భాగస్వామ్యానికి దారితీయవచ్చునని ఆశిస్తున్నాం. యీరెండు దేశాలు యిప్పుడు అంతరిక్ష నహకారం గురించిన చర్చలు ప్రారంభించాయి.

అనేక దేశాలను నన్నిహితం చేసే కుజగ్రహ కార్యక్రమాన్ని చేపట్టడం. నముచితమే. కుజగ్రహ పరిశీలన నమస్త మానవాళికి అవసరం.

ఈ కృషి ఫలిస్తే కుజగ్రహానికి మానవ నహిత వ్యోమనౌకలను పంపే ఏర్పాటును మనం పూనుకోవచ్చు. ఇబ్బందులు యేమైనప్పటికి కుజగ్రహ యాత్ర అంతర్జాతీయమైనదిగా వుంటుంది.

# నికొలాయ్ బుఖారిన్ విషాద మరణం

తీవ్రమైన అనారోగ్యంతో బాధ పడుతూ 1922 డిసెంబరులో లెనిన్ తన రాజకీయ వీలునామాను డిక్టేట్‌చేశారు. బుఖారిన్‌తో సహా తన సహచరులందరి గుణగణాలను లెనిన్ విశ్లేషించారు. "పార్టీలో ఎంతో విలువైన, ముఖ్య సిద్ధాంతకర్త బుఖారిన్; ఆయన మొత్తం పార్టీ అభిమానం చూరగొన్నవారని చెప్పవచ్చు. అయితే ఎంతో మినహాయింపులతో తప్ప ఆయన సైద్ధాంతిక అభిప్రాయాలను సంపూర్ణంగా మార్క్సిజంఅని వర్గీకరించ వీలులేదు. ఎందుకంటే వివరీత పండితాంశ ఆయనలో వుంది. (ఆయన గతితర్కాన్ని ఎన్నడూ అధ్యయం చేయలేదు. దాన్ని ఆయన ఎన్నడూ పూర్తిగా అర్థంచేసుకోలేదనే నా అభి ప్రాయం.

లెనిన్ మృత్యువుతో పోరాడుతున్నారు. డిక్టేషన్‌వల్ల ఎంతో నీరసంగా వుంది. అయినా ప్రతి మాటనూ ఎంతో యోచించాకనే ఆయన వాడారు. పార్టీ నాయకుల్ని గురించి నిష్పాక్షికమైన అంచనా యీ వీలునామా. అయినా బుఖారిన్ గురించి అంతటి అర్థపూర్వకంగా చెప్పారు.



నికొలాయ్ బుఖారిన్ (1888 -1938 ముఖ్య సోవియట్ రాజనీతిజ్ఞులలో, కమ్యూనిస్టు నాయకులలో ఒకరు. సోషల్ డెమొక్రాటిక్ లేబర్ పార్టీ(అనంతరం కమ్యూనిస్టు పార్టీ) లో ఆయన 1906 లో చేరారు. ఫిబ్రవరి విప్లవానంతరం పార్టీ కేంద్ర కమిటీకి ఎన్నికయ్యారు. పార్టీ కేంద్ర పత్రిక ప్రావ్దా సంపాదకులు. స్టాలినిజం బాధితులలో ఒకరు. కుట్రవన్నారన్న ఆరోపణపై 1938 లో ఆయనకు మరణశిక్ష పడింది.

# విప్లవ స్వర్ణ శిశువు

**బుఖారిన్ సతీమణి అన్నాలారినా జ్ఞాపకాలనుంచి:**

**విఖ్యాత రహస్యపోరాట యోధుడు యూరి లారిన్ కుమార్తె అన్నాలారినా అక్టోబరు విప్లవానంతరం లారిన్ ఆర్థికశాస్త్ర అధ్యయనాలు సాగించారు. ఎన్నో పుస్తకాలు రాశారు. లెనిన్ ఆయనకు అనేక ముఖ్య బాధ్యతలు అప్పగించారు. లారినా వెల్లడించిన యీ కింది జ్ఞాపకాలు ఒగొన్యోక్ వారపత్రికలో యిటీవల ప్రచురితమైనాయి.**

మా నాన్నగారి స్నేహితులందరిలోనూ బుఖారిన్‌అంటే నాకెంతో యిష్టం. నవ్వుతూ చిలిపిగా వుండేవాడు. ప్రకృతిని ప్రేమించేవాడు. వక్షుల మొక్కల విజ్ఞానంలో ప్రవీణుడు. చిత్రకళ అంటే ఆయనకు ప్రాణం.

ఒకరోజు ఆయన మా నాన్నగారి ఆఫీసుకు వచ్చాడు. నేను గదిలో అడుగుబెట్టేసరికి ఆయన వెళ్లిపోయాడు. అతడ్ని గురించి అక్కడ వారు చర్చించుకుంటున్నారు. లెనిన్ చెప్పిన మాటలన్నీ నాకు అర్థంకాలేదు. అయితే 'అతను మన విప్లవ. స్వర్ణ శిశువు' అని లెనిన్ అన్నమాటలు నా దృష్టిని ఆకర్షించాయి. నేను చిన్న పిల్లని. అతనేం బంగారంకాదు సజీవమైన మనిషే అని నేను గట్టిగా అన్నాను. 'నిజమే కాని 'అతనిది ఎర్రని బుర్ర' అన్నారు లెనిన్ నవ్వుతూ.

నికొలాయ్ ఎప్పుడెలా ప్రవర్తిస్తారో, చెప్పడం కష్టం. తనపై ఎవరైనా ఆధారరహితమైన నిందలు వేసినప్పుడు ఆయన మహా ఆవేశంగా తన వ్యతిరేకులపై దాడికి దిగేవారు. అయితే ఆయన చాలా సంస్కారమున్న మనిషి. ఒక తుఫానులాటి కాలంలో అతని మనస్తత్వం రూపుదిద్దుకుంది. భావోద్రేకాలమధ్య నలిగిపోయేవాడు. యివన్నీ రాజకీయ వ్యవహారాలలో ఆయనకి నష్టం కలిగించాయి. తాను చెప్పేదే సత్యమైనాసరే అవతలివారిమీద గెలవలేకపోయేవాడు.

బుఖారిన్ అధ్యయనాన్ని గురించి లెనిన్ విమర్శనా పూర్వకంగా వ్యాఖ్యానించారు. లెనిన్ చెప్పింది నిజమే. బుఖారిన్ 1907 లో మాస్కో యూనివర్శిటిలో న్యాయశాఖలోని ఆర్థిక విభాగంలో చేరాడు. అయితే సంవత్సరన్నర కాలంలోనే ఆయన చదువు ఆగిపోయింది మాస్కో పార్టీ కమిటీ సభ్యులందరితోబాటు అతడినీ అరెస్టు చేశారు. నాలుగేళ్లలో మరో మూడుసార్లు ఆయనను జైలులో పెట్టారు. ప్రవాసం పంపారు. ఆయన విదేశాలకు పారిపోయాడు. ప్రవాసంలో ఆయన ఆరేళ్ల జీవితం ఒక సాహసగాథ. ఆస్ట్రియన్ అధికార్లు అరెస్టు చేసి సైనిక జైలులో పెట్టారు. బ్రిటన్‌కు పంపగా మళ్లీ అక్కడ అరెస్టు చేశారు. స్వీడన్‌లో మరోసారి అరెస్టయ్యారు. ఆయనను నార్వేకు ప్రవాసం పంపారు. అక్కడనుంచి ప్రచారం చేసేందుకు అమెరికా వెళ్లారు. రష్యన్ రాచరిక పాలన కూలిందని తెలియగానే తిరిగి రష్యా వెళ్ల దలిచారు. పసిఫిక్ జపాన్‌లమీదుగా సుదూర ప్రయాణంచేసి స్వదేశం చేరుకుని అక్టోబరు విప్లవ నాయకులలో చేరారు. ఆయన రచనలలో 'పండితపరమైన' విషయం వున్నమాట వాస్తవమే అయితే లెనిన్ తన లేఖలో యీ కింది మినహాయింపును స్పష్టంగా పేర్కొన్నారు: 'యివి ప్రస్తుతానికి మాత్రమే చేసిన వాఖ్యలు. అతడు తన జ్ఞానాన్ని పెంచుకోడానికి తన దృష్టిని మార్చుకోడానికి ప్రయత్నించడంలో విఫలమైతే అనే అభిప్రాయంతోచేసినవి' లెనిన్ యీ లేఖ రాసే సమయానికి బుఖారిన్ వయసు 34।

స్టాలిన్ అధికార దుర్వినియోగం గురించి వాస్తవాల పత్రాల అధ్యయానికి సిపిఎస్‌యు కేంద్ర కమిటీ ఒక కమిషను నెలకొల్పింది. బుఖారిన్ చరిత్రను కూడా పరిశీలించి, పార్టీ నాయకులుగా ఆయన స్థానాన్ని తిరిగి గౌరవించడం జరుగుతుందన్న దానిలో సందేహం లేదు.

సోవియట్ రచయితల ప్రథమ మహాసభలో కవిత్వస్థాయి గురించి తాను చేసిన ఘాటైన విమర్శలకు కవులు బాధపడ్డారని ఆ మాటలకు తని క్షమాపణచెప్పాడు. అలాగే స్టాలిన్ సలహాపై 1937 ఫిబ్రవరిలో కేంద్రకమిటీ ప్లీనరీ సమావేశంలో క్షమాపణ చెప్పుకున్నారు. తనపై వేసిన నిందలకు నిరసనగా నిరాహారదీక్ష చేసినందుకు యీ క్షమాపణ చెప్పుకున్నారు

1937 ఫిబ్రవరి 27 ఆ రోజు నాజ్ఞాపకాల్లో నాటుకుపోయింది. స్టాలిన్ కార్యదర్శి పోస్క్రెబై షెవ్ ఫోనుచేశారు. కేంద్రకమిటీ ప్లీనరీ సమావేశానికి రావాల్సిందని పిలుపు. అదే చివరిసారి అని మాకు తెలుసు.

మా వీడ్కోలును వర్ణించడానికి మాటలులేవు. నికొలాయ్ 'నా ముందు ఏడుస్తూ మోకరిల్లాడు. తను నా జీవితాన్ని కష్టాలమయం చేశానని చెబుతూ తనను క్షమించమని వేడుకున్నాడు. మా కుమారుణ్ణి ఒక బోల్షివిక్‌గా తీర్చిదిద్దమని నన్ను అర్థించాడు. 'గుర్తుంచుకో బోల్షివిక్‌ని చేయాలి' మరీమరీ చెప్పాడు. తనమీద వేసిన నింద నిరాధారమని రుజువుచేసేందుకు పాటుపడాల్సిందిగా కోరాడు. భవిష్యత్ పార్టీ నాయకుల కోసం తన లేఖలోని ప్రతిమాటనూ గుర్తుంచుకోవాలని కోరాడు. అది అతని ఆవేదన. నా మనసులో నిరంతరం భద్రపర్చుకున్నాను. ఎన్నేళ్లు గడిచినా అది చెక్కుచెదరలేదు.

"పరిస్థితులు మారతాయి. నాకు తెలుసు. నువ్వింకా చిన్నదానివి. నువ్వు ఆ మార్పుల్ని చూస్తావు. నా ఉత్తరంలో ప్రతిమాటనీ గుర్తుంచుకుంటానని ప్రమాణం చెయ్యి." ప్రమాణం చేశాను. అతను లేచి నన్ను చేతుల్లోకి తీసుకుని ముద్దు పెట్టుకున్నాడు. 'బాధపడకు అన్యుల్, నా ప్రియా, చరిత్ర అప్పుడప్పుడు దారుణమైన తప్పులు చేస్తుంటుంది. అయితే సత్యం వెలుగులోకి వస్తుంది' అన్నాడు గాద్గదిక ంగా.

నేను నిలువెల్లా వణికిపోతున్నాను. యివే ఆఖరి చూపులని మాకు తెలుసు.

'నిన్ను నువ్వే నిందించుకోకు నికొలాయ్' అన్న మాటలు మాత్రమే అతికష్టం మీద నా గొంతు లోంచి పెగిలాయి.

సోషలిస్టు విప్లవ ఆదర్శాలను ఆయన అతి పవిత్రంగా ఎంచాడు. అందుకే ఆయన అంత ఆశావాదంతో చెప్పాడు. మా అబ్బాయిని బోల్షివిక్‌గా తీర్చి దిద్దమన్నాడు.

భవిషత్ పార్టీ నాయకులకు లేఖను, తన అరెస్టుకు కొద్దిరోజుల ముందు ఆయన రాశాడు. తనకు అంత్యఘడియ సమీపించిందని ఆయనకు తెలుసు. తాను ఏ నేరమూ చేయలేదని భవిష్యత్తరాలకి తెలియాలి. తన మరణాంతరమైనా తన మీద నిందపోవాలి అంతే ఆయన కోరుకున్నది. అప్పటికి నా వయసు 23. ఆ ఉత్తరం ప్రతి దొరికితే నా ప్రాణానికి ప్రమాదం అందువల్ల నన్ను కంఠత పట్టమన్నాడు. నాకు కంఠత వచ్చాక ఈ లేఖ లిఖిత ప్రతిని ధ్వంసంచేశాడు, ఒక చిన్న బల్లముందు కూచుని పార్టీకి తన తుది సందేశం ఆయన రాశారు. ఆ బల్ల నిండా లెనిన్ తనకు రాసిన లేఖలు వుండేవి. వాటిని ఆ చివరి రోజుల్లో ఆయన పదేపదే చదువుకుంటూండేవాడు."

# సత్యనిరూపణ

సోవియట్ యూనియన్ సుప్రీంకోర్టు ప్లీనరీ సమావేశం 1988 ఫిబ్రవరి 4 న జరిగింది. నికొలాయ్ బుఖారిన్‌కు, యితరులకు వ్యతిరేకంగా దాఖలైన క్రిమినల్ ప్రొసీడింగ్స్‌కు నిరసన తెలుపుతూ సోవియట్ ప్రొక్యూరేటర్ జనరల్ చేసిన వాదనను ప్లీనరీ సమావేశం పరిశీలించింది. ప్రాథమిక సాక్షాధారాలు లేనందున ఉరిశిక్షను రద్దు చేయాలని, నికొలాయ్ బుఖారిన్‌కు ఇతర కామ్రేడ్స్‌కు వ్యతిరేకంగా చేపట్టిన చర్యలను నిలిపివేయాలని యేకగ్రీవంగా తీర్మానించింది.

ఒక గొప్ప న్యాయసమ్మతమైన కర్తవ్యాన్ని నెరవేర్చారు. సత్యాన్ని నిరూపించారు. బురకుసిని అధిగమించడానికి, యినాటి సమస్యలను — ప్రజాస్వామ్యీకరణ, చట్టబద్ధత, గ్లాస్నోస్త్ సమస్యలను — పరిష్కరించడానికి గతంలో జరిగిన ఘటనల నిష్పక్షపాత విశ్లేషణ సహాయకారిగా వుండగలదు.

విదేశాంగ విధాన సమస్యలు

## ప్రపంచంలోని ఉద్రిక్తతా ఆలవాలాలు

# ఆఫ్ఘనిస్థాన్: జాతీయ సామరస్య పథంలో


జి. మూసాయెల్యాన్
ఎ. షఖోవరోవ్


"జాతీయ సామరస్యం" అనే పదాలు ఆఫ్ఘనిస్తాన్‌లో అంతటా ప్రతిధ్వనిస్తు న్నాయి.

"జాతీయ సామరస్య విధానం మా మత పవిత్ర సూత్రాలకు, షరియాత్ నియమాలకు పూర్తిగా అనుగుణ మైనది. మా ప్రజల యీ మనో భావాలను దృష్టిలో పెట్టుకొని దేశభక్తి పరులైన మతాచార్యులు ప్రభుత్వం అనుసరిస్తున్న యీ విధానాన్ని యేకగ్రీవంగా బలవరుస్తున్నారు. తొమ్మి దేళ్లకు పైగా సాగుతున్న భాతృహత్యా యుద్ధాన్ని నిలుపు చేయడానికి ప్రభుత్వం తీసుకున్న చొరవ యిది. సోదరు లొకరి నొకరు. అర్థం చేసుకోవాలంటే తుపాకుల మోతలు వుండకూడదు. యుద్ధమగ్న పక్షా లు సంప్రదించుకోడానికి, తమ వాదనల ను వినిపించడానికి, పరస్పర ఆమోద యోగ్యమైన పరిష్కారాన్ని కనుగొనడానికి వైషమ్యాలను విడనాడాలి" అని అన్నారు. ఆఫ్ఘనిస్తాన్ ఉలేమాల సుప్రీం కౌన్సిల్ ఛైర్మన్ గుల్యామ్ సర్వర్ మన్సూర్

జాతీయ సామరస్యం అనేది ఈనాడు ఆఫ్ఘన్ నాయకత్వం అనుసరిస్తున్న పంథా, యిది దేశ ప్రగతిశీల ప్రజానీక అభిప్రా యం. మానవాళి జీవిత పరమోన్నత విలువ అయిన శాంతిని నెలకొల్పి, పరిర క్షించ డమే దాని లక్ష్యం.

ఆఫ్ఘన్ ప్రభుత్వం యేకపక్ష కాల్పుల విరమణను ప్రకటించి జాతీయ సామర స్యం దిశలో తొలి నిర్దిష్ట అంజ వేసింది. యీ కాల్పుల విరమణ 1987 జనవరి 15నుండి అమలులోకి వచ్చింది.

కాల్పుల విరమణతో పాటు ఆఫ్ఘనిస్తాన్ పీపుల్స్ డెమొక్రటిక్ పార్టీ ప్రతిపాదించిన జాతీయ సామరస్య కార్యక్రమంలో యీ అంశాలున్నాయి: దేశ ప్రస్తుత, భావి సమస్యల పరిష్కారానికి సాయుధ పోరాట

విసర్జన; ఆర్థిక, రాజకీయ చట్రంలో యావన్మంది ప్రజలకు న్యాయసమ్మతమైన ప్రాతినిధ్యం; గత రాజకీయ కార్యకలాపాలకుగాను వేధించకుండా వుండడం; సార్వత్రిక క్షమాభిక్ష; చారిత్రక, జాతీయ, సాంస్కృతిక సాంప్రదాయాల పరిరక్షణ. ఇస్లాం సూత్రాలను గౌరవించడం, పాటించడం అనే విషయాన్ని ప్రత్యేకించి నొక్కి చెప్పడం జరిగింది. మరో మౌలిక సూత్రం: ప్రభుత్వ నిర్వహణలో తన గుత్తాధి పత్యాన్ని పి.డి.పి.ఎ. కోరుకోలేదు; ఆఫ్గన్ ప్రజల సుఖ సంతోషాలను, శాంతియుత భవిష్యత్తును కోరుకొనే వారందరితోను, జాతీయ సామరస్య క్రమానికి హృదయపూర్వకంగా దోహదం చేసే వారందరితోను ప్రభుత్వంలో పాలు పంచుకోవడానికి తన సంసిద్ధతను ప్రకటించింది.

ఆఫ్గనిస్తాన్ రాజ్యాంగచట్ట ఆమోదం అనేది మరో ప్రధాన రాజకీయ ఘటన. దేశ స్వాతంత్ర్యం, సార్వభౌమాధికారం, ప్రాదేశిక సమగ్రత పటిష్టీకరణ; ప్రపంచంలో దాని యితోధిక పాత్ర, పలుకుబడి పెంపు; సామాజిక న్యాయం, సమానత; జాతీయార్థిక వ్యవస్థ అభివృద్ధి, జీవన ప్రమాణాల మెరుగుదల—యివీ రాజ్యాంగ చట్టం ఆఫ్గన్ ప్రజల ముందుంచిన వుదాత్త లక్ష్యాలు. యీ రాజ్యాంగ చట్టం జాతీయ సామరస్య క్రమంలో ఒక ముఖ్యపాత్ర నిర్వహించనుంది. స్థానిక ప్రభుత్వ సంస్థలు, జాతీయ సామరస్య విషయాల ప్రత్యేక కమీషన్లు ఆఫ్గనిస్తాన్‌లో నానాటికీ చురుకుగా పని చేస్తున్నాయి. యివి ప్రస్తుతం 90,000 లకుపైగా కార్యకర్తలను ఐక్యం చేస్తున్నాయి. స్థానిక స్వయం పరిపాలనా మిశ్రమ సంఘటనలను అనేక గ్రామాల్లో నెలకొల్పడం జరిగింది. ప్రతిపక్షానికి ముఖ్యమైన ప్రభుత్వ పదవులను యివ్వడం జరిగింది. యీ విధంగా ప్రస్తుత ఆఫ్గన్ నాయకత్వం ప్రతిపక్షంతో అధికారంలో పాలుపంచుకోడానికి తన సంసిద్ధతను ఆచరణలో వ్యక్తం చేస్తోంది.

కొత్త పార్టీలను యేర్పాటు చేసు కునే, వాటిని చట్టబద్ధమైనవిగా ప్రకటించే ఒక శాసనాన్ని ఆఫ్గన్‌విప్లవ సమితి ఆమోదించింది. దేశంలోని సమస్త ప్రజాతంత్ర, దేశభక్తియుత శక్తుల నిజమైన సంఘటనను సృష్టించే దిశలో యిది ఒక ముఖ్య మైన అంజ. వాటి సిద్ధాంతాలు, అభిప్రాయాలు, యెత్తుగడలు యేమైనప్పటికీ యిదీ వాటి వుమ్మడి లక్ష్యంగా వుండాలి: ఆఫ్గనిస్తాన్‌లో సత్వరమే శాంతి పునరుద్ధరణ; జాతీయ స్వాతంత్ర్య, సార్వభౌమాధికార, ప్రాదేశిక సమగ్రతా పటిష్టీకరణ; అలీనోద్యమ సూత్రాల పట్ల నిబద్ధత, అన్ని దేశాలతో ముఖ్యంగా ఆఫ్గన్ పొరుగుదేశాలతో స్నేహ సహకారాలు.

మిశ్రమ సంఘటనరూపం క్రమక్రమంగా ప్రజాసంస్థలకు, ట్రేడ్ యూనియన్లకు, కళాకారుల, మేధావుల యూనియన్లకు విస్తరిస్తోంది. అఖిల ఆఫ్గన్ మహిళా సమితి సభ్యత్వం గతకొన్ని యేళ్ళుగా ఎన్నోరెట్లు పెరిగి 100,000 కు చేరుకుంది. ఆఫ్గనిస్తాన్‌లో యేర్పాటు చేస్తున్న యునైటెడ్ నేషనల్‌ఫ్రంట్ దేశ ప్రజా స్వామ్య వ్యవస్థను పటిష్టం చేయగలదు; అభివృద్ధి నిరోధకుల మార్గంలో, బయటి సాయుధ జోక్యందారు మార్గంలో గట్టి అవరోధంగా వుండగలదు.

వ్యవసాయ సమస్యపట్ల నూతన దృక్పథం, దాని అమలు యిటీవలి మార్పుల్లో







క్షమాభిక్ష పొందిన ఖైదీలు కాబుల్ పరిసరాల్లోని పులెచర్ఖీ జైలునుండి బయటికి వస్తున్న దృశ్యం.
అంతర్‌చిత్రం: తిరిగి బంధువులతో (పైన, ఎడమవైపు) కాబుల్‌లో పిల్లలు (పైన, కుడివైపు) కాబుల్‌లో ఒక వీధి (దిగువ, ఎడమవైపు) కాబుల్‌లో ఒక బుక్‌షాప్ (దిగువ, కుడివైపు)



పేర్కొనదగినవి. భూమి, జల సమస్యల పరిష్కారానికి సంబంధించిన ప్రాథమిక సూత్రాలపై విప్లవ సమితి యిటీవల ఆమోదించిన డిక్రీలో యిది ప్రతి బింబించింది. యిది దేశంలో 80 శాతాని కిపైగా వున్న రైతుల్లోనేగాక సమాజంలోని యితర వర్గాల్లో కూడా ఆసక్తిని రేకె త్తించింది. ఏప్రిల్ విప్లవం సాధించిన ప్రధాన విజయాల్లో ఒకటైన భూమి, జలసంస్కరణలను జాతీయ సామరస్య పరిస్థితుల్లో ప్రధానలక్ష్యాల కనుగుణంగా సర్దుబాటు చేయడం జరుగుతోందని పి.డి.పి.ఎ కార్యదర్శి సాలైమొహమ్మద్ జిరే టెలివిజన్ ప్రసంగంలో తెలియజేశా రు.

''భూమి, రైతు సమస్యకు సంబంధించి పి.డిపి.ఎ వ్యూహాత్మక లక్ష్యాల్లో మార్పు లేదు......అవి ఫ్యూడల్, ఫ్యూడల్ పూర్వకా లపు సంబంధాల నిర్మూలన, విస్తృత శ్రామిక రైతాంగ ప్రయోజనాల కను గుణంగా ఏకరీతిగా భూసంస్కరణల అమలు, జాతీయ ఆర్థిక వ్యవస్థను, జీవన ప్రమాణాలను పెంపొందించడానికి గ్రామీణ వుత్పాదకశక్తుల అభివృద్ధి'' అని ఆయన అన్నారు. ఏప్రిల్ విప్లవం తర్వాత తొలి సంవత్సరాల్లో భూ, జలసంస్కరణ అమల్లో జరిగిన పొరపాట్లను తప్పుడు అంచనాలను సరిదిద్దడం యీ కొత్త డిక్రీలక్ష్యం.

గ్రామ సీమలో 100 జెరిబ్స్ (20 హెక్టార్లు) భూగరిష్ట పరిమితిని విధించడం — యిది కౌల్దారీ సమస్య పట్ల అనుసరించిన నూతన దృక్పథం. విప్లవానంతరం రైతు లు పొందిన భూమిని వారికి శాశ్వతంగా యిచ్చివేయడం జరిగింది.

ఆఫ్గనిస్తాన్‌లోని, దాని పరిసరాల్లోని పరిస్థితిపై, జాతీయ సామరస్య విధానంపై సోవియట్ యూనియన్ ఆఫ్ఘ నిస్తాన్ అభిప్రాయాల సారూప్యతలను 1987 జూలైలో నజీబుల్లా సోవియట్ పర్య టన సందర్భంగా ఆయనతో జరిగిన సమావేశంలో మిహాయిల్ గోర్బచేవ్ పేర్కొన్నారు.

తమ పొరుగుదేశమైన ఆఫ్ఘనిస్తాన్ ఒక స్వతంత్ర, సార్వభౌమాధికార, అలీన రాజ్యాంగా వుండాలని సోవియట్ ప్రజల ఆకాంక్ష. ఆఫ్ఘనిస్తాన్ తన గమ్యాన్ని స్వయంగా నిర్ణయించుకునే, తన ప్రభు త్వాన్ని ఎంచుకునే, జాతీయలక్ష్యాలకు, ప్రయోజనాలకు అనుగుణంగా జాతీ యాభివృద్ధి కార్యక్రమాన్ని రూపొందించు కునే తిరుగులేని హక్కును సోవియట్ ప్రజలు బలపరుస్తున్నారు. సామ్రాజ్య వాదం ప్రారంభించిన అప్రకటిత యుద్ధా నికి గురైన ఆఫ్గన్ ప్రజలకు సోవియట్ యూనియన్ అపార రాజకీయ, ఆర్థిక, నైతికతోడ్పాటు యిచ్చింది. యిందుకు ఆదేశం ప్రజలు హృదయ పూర్వక కృత జ్ఞతలు తెలియజేస్తున్నారు.

అలీనదేశాల జర్నలిస్టుల సమావేశానికి 1987 జూన్‌లో కాబుల్ ఆతిథ్యమిచ్చింది. యిందులో సోవియట్ జర్నలిస్టులు పరిశీ లకులుగా పాల్గొన్నారు. మూడు అంతర్జాతీ సంస్థలు, భారత్‌తో సహా 40 దేశాలకు చెందిన 75 మంది ప్రతినిధులు, తమ పత్రాల్లో, ప్రసంగాల్లో ఆఫ్గనిస్తాన్ అనుసరి స్తున్న జాతీయ సామరస్య విధానాన్ని ఏకగ్రీవంగా బలపరిచారు. (మెజ్దునరోద్న యాజిజ్, సంక్షిప్తం)

# సోవియట్ భారత సాహిత్యాలలోని ఉమ్మడి లక్షణాలు

## వై. చెలిషేవ్

సోవియట్ విజ్ఞానశాస్త్రాల అకాడెమీ
కరెస్పాండింగ్ సభ్యులు
నెహ్రూ బహుమతి విజేత

*సోవియట్ భారత ప్రజల ప్రాచీన సాంస్కృతిక వారసత్వంలోని కొన్ని పోలికలను గురించి ఈ వ్యాసం తొలిభాగంలో (సో న 3 వ సంచికలో) చర్చించడం జరిగింది. అయితే రెండుదేశాల్లోని ఆధునిక సాహిత్యంలోకూడా పోలికలు కనిపిస్తాయి.*

*రెండో భాగం*

పందొమ్మిదో శతాబ్దపు భారత సాహిత్యం, వర్ధని మిది, పందొమ్మిది శతాబ్దాలకు చెందిన రష్యన్ సాహిత్యం — వాటి వాటి నిర్దిష్ట జాతీయ లక్షణాల పరంగానూ విభిన్న సామాజిక రాజకీయ పూర్వ రంగాల పరంగానూ వైవిధ్యం కలిగి వున్నప్పటి కీ—కొన్ని చారిత్రక, ప్రతీకాత్మక సామ్యగుణాలను కూడా కలిగి వున్నాయి. భారత ప్రజలలో జాతీయ చైతన్య అభివృద్ధీ, తత్ఫలితంగా పందొమ్మిదో శతా బ్దంలో వెల్లువికిన సాంస్కృతిక స్రవంతీ, ఉచ్ఛస్థా యికి చేరు కుంటున్న జాతీయ విమోచన ఉద్య మమూ నూతన ప్రజాస్వామ్య సాహిత్యానికి జన్మని చ్చాయి. ఇదిలా ఉండగా రష్యాలో అర్ధబానిస విధానం సంక్షోభంలో పడటంలో, విప్లవాత్మక విమోచనోద్యమం తలెత్తడంతో రష్యన్ సాహిత్యంలో నవిమర్శక వాస్తవికవాధం రూపుదిద్దుకో సాగింది సమాజంలో నెలకొన్న ప్రతిష్టంభన, మత దురభిమానం, అధికారుల అవినీతి, భూస్వాముల నిరంకుశత్వం, పెట్టుబడిదారుల దురాశ, నిర్దయ, మేధావుల ఆత్మవంచన, నీతిబాహ్యత — ఇలాంటి సామాజిక దుర్లక్షణాలను ఎండగట్టడంలో భారత రష్యన్ సాహిత్యాలమధ్య ఎంతో సామ్యం కనిప స్తుంది. ఫన్వీజిన్, గ్రిబయెదోవ్, గగోల్, సల్తీకవ్ ష్చెద్రిన్, నెక్రాసవ్, చెహోవ్ తదితర రష్యన్ రచయితలూ, మరెందరో భారతీయ రచయితలూ తమతమ దేశాల అభివృద్ధిని అడ్డంకొట్టె శక్తులను విమర్శించారు. ఆనాటి భారతీయ రచయితల్లో బెంగాలీ రచయితల గురించి ప్రముఖంగా చెప్పాల్సి ఉంది. దీనబంధు మిత్ర, వలనవాదాన్ని ఎదిరించారు. ప్రహసనాలు రచించడంద్వారా మధుసూదన్ దత్త మత మౌఢ్యా న్ని, మత దురహంకారాన్నీ ఖండించారు. బంకి

**సోవియట్ భారత సాహిత్యాల్లో ఉమ్మడి లక్షణాలు**

ంకిమ్‌చంద్ర ఛటోపాధ్యాయ 'కమలకాంత అనే కదలో భూస్వామ్య వ్యవస్థను ఎండగట్టారు. పెట్టుబడీదారి సమాజంలోని తీవ్ర వైరుధ్యాలను వెల్లడించారు. భారతేందు హరిశ్చంద్ర తన వ్యంగ గీతాల (ముక్రీ) ద్వారా, నాటకాలద్వారా — ముఖ్యంగా 'భారత దుర్దశ' ద్వారా — దోపిడీమీద ఆధారపడిన ఆర్థిక రాజకీయ వ్యవస్థనూ, పోలీసుల బీభత్సాన్నీ మాతృదేశ ప్రయోజనాల సంరక్షణలో మేధావుల అసహాయస్థితినీకనులకు కట్టినట్టు చిత్రించారు.

పందొమ్మిదో శతాబ్ది మధ్యలో భారత సాహిత్య రంగంలో నవలా ప్రక్రియ ప్రారంభమయింది. తొలినాళ్ల భారతీయ నవలా సాహిత్యంలోనే సమాజ పరివర్తన లక్షంగా పెట్టుకున్న నూతన చైతన్యం ప్రతిబింబించింది. బెంగాలీ రచయిత ప్యారీచంద్ మిత్ర రాసిన "చెడిన బిడ్డ", మరాఠీ రచయిత బుబా పద్మాంజే రచన "యమునా పార్యాళి", కందుకూరి వీరేశలింగం నవల "రాజ శేఖర చరిత్రము", మరెన్నో నవలలు భారత సమాజంలో స్త్రీల దుస్థితిని వెల్లడించాయి. మధ్య యుగాల ధర్మసూత్రాల ఆధారంగా సాగుతున్న సాంఘిక దురాచారాలను ఖండించాయి; భోగ భాగ్యాలు అనుభవిస్తున్న వర్గాలవారి కపటత్వాన్నీ భ్రష్టత్వాన్నీ ఎండగట్టాయి. ఈ అంశానికి సంబంధించి చూస్తే ఈ రచనలు పద్దెనిమిదో శతాబ్దికి చెందిన రష్యన్ వాస్తవికవాద సెంటి మెంటలిస్టు రచనలను పోలి వున్నాయనిపిస్తుంది. ముఖ్యంగా దుర్మార్గుడూ అవినీతిపరుడయిన ఒక కులీనుడి దౌష్ట్యానికి బలయిపోయిన ఒక అమ్మాయి కథను చిత్రిస్తూ ఎన్. కరామ్‌జిన్ రాసిన 'పావం లిజా' అన్న నవలకూ తొలినాటి భారతీయ నవలాసాహిత్యానికీ ఎన్నో పోలికలు కనిపిస్తాయి.

రష్యాలో తలెత్తిన విప్లవోద్యమం, భారతదేశంలో పుంజుకున్న జాతీయ విముక్తి పోరాటం — యివి విమోచన భావాలతో కూడిన ప్రజాస్వామ్య సాహిత్యాల పరిణామాన్ని నిర్ణయాత్మకంగా ప్రభావితం చేశాయి. 1857-59 సంవత్సరాలలో భారత దేశంలో సాగిన ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం నూతన ప్రజాస్వామిక సాహిత్య అవతరణకు దారితీసినట్లుగానే రష్యాలో 1825 లో తలెత్తిన డిసెంబరిస్టుల ఉద్యమమూ, 1905-1907 సంవత్సరాలలో సాగిన తొలి రష్యన్ విప్లవమూ ఆదేశపు సాహిత్యాన్ని ఎంతగానో ప్రభావితం చేశాయి ఆ కాలంలో అటు రష్యాలో యిటు భారతదేశంలో కూడా ఎందరో రచయితలు తమతమ దేశాల ప్రజలకుమరింత ఉజ్వలమయిన భవిష్యత్తుకోసమూ, సుఖప్రదమయిన జీవనంకోసమూ పోరాట రంగంలోకి దూకారు.

భారతీయ, రష్యన్ రచయితల్లో కొందరిని పోలుస్తూ అటు భారతదేశంలో ఇటు సోవియట్ యూనియన్‌లోకూడా కొన్ని పరిశోధనలు జరిగాయి. ప్రేమ్‌చంద్‌ను గోర్కీతో పోల్చడం కద్దు. ఈ మహా రచయితల సౌందర్య దృష్టి శిల్పం, ఒకదానికొకటి సన్నిహితంగా ఉండేవనేది నిస్సం దేహమయిన సత్యం. ముఖ్యంగా ప్రేమచంద్ చివరి రోజుల్లో ఆయనమీద గోర్కీ ప్రభావం ప్రత్యక్షంగా ఉండేది.

సామాజిక జీవనంలో సాహిత్యం పాత్ర, నూతన మానవుడికి చైతన్యం కలిగించడంలో సాహిత్యం నిర్వర్తించాల్సిన కర్తవ్యంలాంటి విషయాల్లో గోర్కీ మాదిరే ప్రేమ్‌చంద్‌కూడా అభ్యుదయకర భావనలు ప్రకటించారు. స్వాతంత్ర్యం, సామాజిక న్యాయం, సమాజ ప్రగతి లక్ష్యాలకోసం చేసే పోరాటంలో సాహిత్యం ముఖ్యమయిన ఆయుధమని గోర్కీ మాదిరిగానే ప్రేమ్‌చంద్ విశ్వసించారు.

ప్రేమ్‌చంద్‌ను టాల్‌స్టాయ్‌తోకూడా పోల్చడంకద్దు. ప్రేమ్‌చంద్ రచనలమీద అవగాహన మీదా—ముఖ్యంగా తొలినాళ్లలో టాల్‌స్టాయ్ ప్రభావం విశేషంగా ఉంది టాల్‌స్టాయ్ చెప్పిన విశ్వప్రేమ, అహింస, స్వీయనైతిక పరిపూర్ణత్వంలాంటి భావాలకు సన్నిహితంగా ఉండే మహాత్మాగాంధీ భావాలు తొలిరోజుల్లో ప్రేమ్‌చంద్‌ను ప్రభావితం చేసిన విషయం అందరికీ తెలిసిందే. టాల్‌స్టాయ్ రచనలలో అంతటా కనిపించే ప్రజాస్వామ్య భావాలూ, అత్యున్నత నైతిక ఆదర్శాలూ ప్రేమ్‌చంద్‌ను ఆకర్షించాయని మా అభిప్రాయం.

పరస్పరం ముడిపడివున్న సృజనాత్మక కృషి సాగించిన సోవియట్ భారత రచయితలను పోల్చడంతో పాటుగా ఏవిధమైన సంబంధంలేని రచయితలను పోల్చేందుకు కూడా కొందరు పరిశోధకులు ప్రయత్నించారు.

రవీంద్రనాద్ టాగూరు నూ టాల్‌స్టాయ్‌నూ పోల్చి చెబుతూ ఉంటారు. ఈ తరహా పోలికలకు

నిర్దిష్ట ఆధారాలు లేకపోలేదు. వీరిద్దరూకూడా ప్రకృతి, మేధ లీనం కావడాన్ని పరిపూర్ణమయిన, సత్యసుందరరూపానికి గీటురాయిగా భావించారు. ఇద్దరూ వలసవాదాన్నీ సామ్రాజ్యవాదాన్నీ జాతివి వక్షనూ, పాశ్చాత్య నాగరికతలోని నైతిక పతనాన్నీ ఖండించారు. వీరిద్దరూ ఆయాజాతుల అంత రాత్మకు ప్రతిధ్వనులు; ఆయాజాతుల వాణిని వినిపించారు; ప్రజాస్వామ్య జనుల ప్రయోజనా లకు పతాకాలు. సత్యానికీ న్యాయానికీ ప్రవక్తలు, చెడుగుకూ హింసకూ ప్రత్యర్థులు. అయితే టాగూర్‌పై టాల్‌స్టాయ్ ప్రభావం ఎక్కడా కనిపించదు. వారిది దార్శనికపరమయిన బాం ధవ్యం. టాల్‌స్టాయ్‌కూ టాగూర్‌కూ సామ్యాలు చెబు తూ ప్రసిద్ధ సింధీరచయిత ఎం.వై. మాల్కానీ, ప్రసాద్‌రామచంద్ర, కృష్ణాకృపలానీ, అగర్వాల్, భారత్ భూషన్, ఉమాశంకరజోషీ తదితరులు అనేక రచనలు చేశారు.

బొంబాయికి చెందిన పరిశోధకుడు జో అన్సారీ సోవియట్ విజ్ఞాన పరిషత్తులోని ప్రాచ్య అధ్యయ నకేంద్రానికి తన సిద్ధాంత గ్రంథం సమర్పిస్తూ ఉర్దూ మహాకవి మీర్జా గాలిబ్‌కూ రష్యన్ మహాకవి అలెక్సాండ్రేపుష్కిన్‌కూ సామ్యం చెప్పారు. పుష్కిన్ ను ఆధునిక హిందీ సాహిత్యప్రవక్త భారతేందుతో పోల్చవచ్చునని ప్రసిద్ధ భారతీయ పరిశోధకుడు మహా పండితుడు రాహుల్ సాంకృత్యాయన్ భావించారు. మహమ్మద్ ఎక్బాల్ శతజయంతి సందర్భంగా ఆ మహనీయుడికి పుష్కిన్‌కూ గల సామ్యాలను విశ్లేషించేందుకు నేను (చెలిషేవ్) ప్రయత్నించాను.

భారత, సోవియట్ సాహిత్యాలు పరస్పరంభిన్న మయిన సామాజికార్థిక పూర్వరంగాలలో, భిన్న సాంస్కృతిక సంప్రదాయాలతో అభివృద్ధి చెం దుతూ ఉన్నప్పటికీ వాటిమధ్య ఎన్నో సామ్యాలున్నా యి. బహుళజాతి లక్షణం వీటిలో ముఖ్యమయి నది.

అక్టోబరు విప్లవానంతరం తొలినాళ్లలో సోవియట్ సాహిత్యం ప్రధానంగా కాల్పనిక స్వభా వం కలిగి ఉండేది. మయకోవ్‌స్కీ, బ్ర్యూసవ్, తిఖనోవ్, బగ్రిత్‌స్కీ, తిచినా, తబిద్జె, అయినీ, ఖామ్‌సా తదితరులు విరుచుకు పడుతున్న తుఫా నునూ, ప్రపంచ వ్యాప్తంగా రేగుతున్న దావానలాన్నీ దున్నే నాగలినీ, ఎర్రజెండా నీడలో పోరాడుతున్న విప్లవయోధులనూ తమ కవితామూర్తులుగా చిత్రించారు.

భారతదేశంలోకూడా స్వాతంత్ర్యానంతరం తొలిరోజుల్లో, కాల్పనిక సాహిత్యం ప్రధానధోరణిగా ఉండేది. "స్వాతంత్ర్యపూర్వ పోరాటదశ మాదిరే స్వాతంత్ర్యానంతరం కూడా పరివర్తనాదశగా చెప్ప దగిన తొలి మూడేళ్ల కాలంలోకూడా సాంస్కృతిక పునరుజ్జీవనోద్యమ ఫలితంగా తలెత్తిన నూతన కాల్పనిక ధోరణి భారత సాహిత్యంలో దర్శనమి స్తుంది" అన్నారు ప్రసిద్ధ సాహిత్యచరిత్రవేత్త నమ్వర్‌సింగ్.

సోవియట్ భారతదేశాలవర్తమాన సాహిత్యతు లనాత్మక పరిశోధన ఫలవంతంగా, ప్రయోజనక రంగా ఉంటుంది. నేటి సోవియట్ సాహిత్యంలోని ఉత్తమరచనలు పునర్వ్యవస్థీకరణ క్రమాన్నీ సామాజికఆర్థిక సాంస్కృతిక పునర్నవీకరణాన్నీ చిత్రిస్తున్నాయి. తక్షణ సమస్యల గురించి రాయడంద్వారా, నిజమయిన ప్రజాస్వామ్యంకోస మూ సామాజిక న్యాయంకోసమూ పోరాడడంద్వారా, జీవితంలోని అన్నిరంగాల్లోనూ పేరుకు పోయిన ప్రతిష్టంభనకు వ్యతిరేకంగా పోరాడడంద్వారా, సోవియట్ రచయితలు ఆధునిక సమాజాన్ని వాస్తవికంగా చిత్రిస్తున్నారు.

భారతీయ సాహిత్యం పురోగమిస్తున్నది : అది భారతదేశంలో నెలకొని ఉన్న సంక్లిష్ట పరిస్థితులను వైరుధ్యాలను చిత్రిస్తున్నది. గత కాలపు అవశేషా లకు వ్యతిరేకంగా, నూతన నైతిక ప్రమాణాలకోస మూ ప్రతీపశక్తులకు వ్యతిరేకంగా ప్రగతిశీ లురు జరుపుతున్న పోరాటాన్ని చిత్రిస్తున్నది.

భారతదేశంలో, సోవియట్ యూనియన్‌లో కూడా, నూతన జీవితాన్ని నిర్మించడం, నూతన మానవుడికి చైతన్యం ప్రసాదించడం, శాంతి, ప్రజా స్వామ్యం, ప్రగతి ఉన్నతాశయాలకు బలం చే కూర్చడం అనే అత్యున్నత పౌరధర్మాన్ని నిర్వర్తి స్తోంది వర్తమాన సాహిత్యం. ఈ విషయంలో రెండుదేశాల సాహిత్యం, ఒకదానితో మరొకటి ఎంతో సామ్యం కలిగి ఉన్నాయి.



మహాకవి భారతి "నవరష్యా" అన్న గేయంలో అక్టోబరు విప్లవానికి స్వాగతం పలికారు. నవరష్యా లోని విప్లవాత్మక మార్పుల పట్ల భారత స్వాతం త్ర్యోద్యమ నాయకులు, రచయితలు, మేధావులు యెంతో ఆసక్తి చూపారు. ఈ యుగంలోని మహత్తర విప్లవాత్మక పరివర్తనల వెనుక గల వ్యక్తి వి.ఐ. లెనిన్‌ను చారిత్రక మహాపురుషునిగా పరిగణిం చారు. భారతదేశం లోను, ప్రపంచమంతటా ఆయనపై అనేక గ్రంథాలు, వ్యాసాలు వెలువడ్డాయి. ఈ మహానాయకుని జీవితం అనేక మంది విప్లవ కారులకే గాక, సాధారణ ప్రజలకు సైతం ఉత్తేజ మిచ్చింది.

"వి.ఐ. లెనిన్ కళాత్మక చిత్రాలు, ఛాయాచి త్రాల ఎగ్జిబిషన్" మద్రాసు లోని లలితకళా అకా డమీలో ప్రస్తుతం జరుగుతోంది. ఈ ఎగ్జిబిషన్ మానవాళి భవితవ్యాన్నే మార్చివేసిన బహుముఖ ప్రజ్ఞాశాలి మూర్తిని మనముందుంచుతోంది. మాస్కో లోని లెనిన్ సెంట్రల్ మ్యూజియం, సెంట్రల్ మ్యూజియం ఆఫ్ రివొల్యూషన్ ఈ ఎగ్జిబిషన్‌కు రూపకల్పన చేశాయి.

అనేక ఛాయాచిత్రాలు, వర్ణచిత్రాలు, శిల్పాలు, అనేక పత్రాల ప్రతులు, లెనిన్ వాడిన వస్తువులతో సహా 500 కు పైగా వస్తువులు ఈ ఎగ్జిబిషన్‌లో వున్నాయి.

ఈ ఎగ్జిబిషన్‌లో లెనిన్ కుటుంబ సభ్యుల ఫొటోలూ, లెనిన్ తన చదువులో ఎంత చురుకుగా ఉండేవాడో తెలిపే పాఠశాల సర్టిఫికేట్ నకలూ ఉన్నాయి. లెనిన్ ఎల్లప్పుడూ వుత్తమశ్రేణి విద్యా ర్థిగా వుండేవాడనితెలిపే కెరెన్‌స్కీ తండ్రిరాసిన లేఖ యీ ఎగ్జిబిషన్‌లో వుంది. వింటర్ ప్యాలెస్‌పై దాడిచేయడానికి సంకేతమిచ్చిన, అలాగే మాస్కో విప్లవ బృందానికి సంకేతమిచ్చిన అరోరా యుద్ధ నౌక నావికులకు చెందిన ఆసక్తికరమైన వస్తువులు యిందులో వున్నాయి. లెనిన్ వుపయోగించిన కలం యీ ఎగ్జిబిషన్‌లో వుంది.

లెనిన్ తొలి గ్రంథాలు, ఇస్క్రా వార్తా పత్రిక, ఆ పత్రిక మాట్రిక్స్ లెనిన్ విప్లవ కార్య కలాపాలను గురించి క్షుణ్ణంగా తెలియ జేస్తాయి.

కార్మికులు కానుకగా యిచ్చిన రెండు అల్యూమి నియం స్పూన్లు, గడియారం, సిగార్ బాక్స్ (లెని న్‌కు చుట్టకాల్చే అలవాటు లేదు), కెమెరా లాంటి సొంత వస్తువులను త్రీడైమెన్షన్ పద్ధతిలో ప్రదర్శి స్తున్నారు. యిది యీ ఎగ్జిబిషన్‌కు ఒక ఆకర్షణ.

భారతదేశంపై దాని స్వాతంత్ర్యోద్యమంపై లెనిన్‌కు ఎప్పుడూ ఆసక్తి ఉండేది. మాస్కోలోని లెనిన్ ఫ్లాట్‌లో భారతదేశం పైనవచ్చిన పుస్తకాలు అనేకం కనిపిస్తాయి. మద్రాసు లోని జి.ఎ. నటేశన్ అండ్ కో, గణేష్ అండ్ కో, ప్రచురించిన పుస్తకాలు కొన్ని అక్కడ ఉన్నాయి. "లెనిన్, భారతదేశం" అన్న విభాగంలో ఈ ప్రచురణల ప్రతులు ఉన్నాయి. లెనిన్ జీవితంపై కృష్ణారావు రాసిన పుస్తకం, భారతదేశంలో కూడ అపురూపమైన యిలాంటి



FESTIVAL OF USSR IN INDIA 1987-88

V.I. LENIN ARTISTIC AND PHOTOGRAPHIC EXPOSITION

FROM 20.3.88 TO 17.4.88



అనేక గ్రంధాలను కూడా ఇక్కడ ప్రదర్శిస్తున్నారు. సింగారవేలు చెట్టియార్ సంపాదకత్వంలో వెలువడిన "కిసాన్ లేబర్ గెజిట్" లెనిన్ మరణంపై సంపాదకీయం రాసింది. ఇది, భారతియులు, లెనిన్‌ను ఎంత గాఢంగా ప్రేమించారో తెలుపుతుంది.

అనేకమంది భారతీయ విప్లవకారులు లెనిన్‌ను కలుసుకున్నారు. లెనిన్‌కు వారు బహూకరించిన గంధపు చేతి కర్ర కూడా ఈ ఎగ్జిబిషన్‌లో ఉంది.

ప్రదర్శించిన ప్రతి వస్తువూ లెనిన్ బహుముఖ వ్యక్తిత్వాన్నే గాక ఆయన మహత్తర ఘటనలను గురించి కూడా తెలుపుతోంది. వెనుకబడిన దేశాన్ని విప్లవ జ్వాలల గుండా నడిపిన ఆ మహామనీషి యెంత సరాడంబరుడో, ఆధునిక రష్యాను సృష్టించడమనే తన లక్ష్యాన్ని సాధించడంలో ఆయన యెలాటి రాజీకీ ఇయ్య కొనని యెంతటి నిశ్చలమనస్కుడో, సామాన్య ప్రజల పట్ల యెంత దయతో ఉండేవాడో మనం ఈ ఎగ్జిబిషన్‌లో తిరుగు తున్నప్పుడు అనుభూత మవుతుంది. ఇది చూచితీరవలసిన ఎగ్జిబిషన్.

ఈ ఎగ్జిబిషన్‌కు మద్రాసు క్రాఫ్ట్స్ కౌన్సిల్ ఉపాధ్యక్షురాలు శ్రీమతి రాధా పణిక్కర్ మార్చి 20న లలితకళా అకాడమీలో ప్రారంభోత్సవం చేశారు. మద్రాసు దూరదర్శన్ డైరెక్టర్ శ్రీమతి అఖిలా శివరామన్, సోవియట్ కాన్సల్ జనరల్ వి.జి. చెరెపోవ్, తమిళనాడు సాంస్కృతిక శాఖ కార్యదర్శి శ్రీ ఎస్.టి. కాశీ రాజన్,జాతీయ పత్ర భాండాగారానికి చెందిన శ్రీ ఒ.పి. బుగ్రా, మద్రాసు వస్తు ప్రదర్శన శాల డైరెక్టర్ శ్రీ ఎన్. హరినారాయణ సభలో ప్రసంగించారు.

ఈ ఎగ్జిబిషన్ ఏప్రిల్ 17 వరకూ ఉండింది.



# నిర్మల హృదయ ఇందిరాగాంధీ : కలలు, ఫలితాలు

ఐ. సుచ్కోవ్, క్యాండిడేట్ సైన్స్
(చరిత్ర)

ఈ శీర్షికతో ఒక పుస్తకాన్ని మాస్కోలోని పొలిటికల్ లిటరేచర్ పబ్లిషర్స్ ప్రచురించింది. దీని రచయిత అలెక్సాండ్రా గోరిన్. నెహ్రూ, గాంధీ, అనే పుస్తకాలు రచించి పాఠక లోకానికి పరిచితు లయ్యారు. నెహ్రూను గురించిన టెలివిజన్ సీరియల్‌ను రచించినందుకు ఆయనకు సోవియట్ ప్రభుత్వ బహుమతి లభించింది. ఆయన యిలా రాశారు.

"సోవియట్—భారత సంబంధాల చరిత్రతో ముడిపడి వున్న ప్రసిద్ధ భారతీయ రాజనీతిజ్ఞుల, రాజకీయ వేత్తల జీవిత చరిత్రపై ముఖ్యంగా ప్రసిద్ధ రాజకీయ నాయకులు, చింతనా పరులు అయిన మహాత్మాగాంధీ, జవహర్‌లాల్ నెహ్రూ, ఇందిరా గాంధీ జీవిత చరిత్రపై కృషిచేయడమంటే నాకెంతో యిష్టం. వారి జీవితం, కార్యకలాపాలు, ప్రపంచ దృక్పథం ప్రపంచంలోని యావన్మందికి ముఖ్యమైనవి. అందువల్ల సకల దేశాల ప్రజలు వాటిపట్ల ఆసక్తి కనబరుస్తారు.

"జవహర్‌లాల్ నెహ్రూ కార్యకలాపాలతో ఇందిరా గాంధీ జీవితం సన్నిహితంగా ముడిపడి వుంది. భారతదేశ చరిత్రతో, జాతీయ విముక్తి కోసం భారత ప్రజలు జరిపిన పోరాటంతో నెహ్రూ కుటుంబం పెనవేసుకుపోయింది. యీ కుటుంబం నిర్వహించిన రాజకీయ పోరాటాన్ని అప్పటి ప్రభుత్వం పలుమార్లు అణచివేసింది. ఈ పోరాటమే ఇందిరా గాంధీకి పాఠాలు నేర్పింది. అలాగే జైలు నుంచి ఆమె తండ్రిగారు ఆమెకు రాసిన లేఖలు వుపయోగపడ్డాయి.

"....మహాత్మాగాంధీ, జవహర్‌లాల్ నెహ్రూలలాగానే ఆమె తన ప్రజలుకన్న కలలకోసం పాటుపడడంలో వాటిని సార్థకం చేయడంలో విజయం సాధించారా?" .....కొందరు ఆరోపించి నట్టుగా "కుటుంబ హక్కు" గా ఆమెకు అధికారం సంక్రమించలేదు. స్వతంత్ర భారతదేశ ప్రజ ఆమెను ఎన్నుకొన్నదని అంటారు గోరిన్.

దాదాపు 20 సంవత్సరాలపాటు దేశ నాయ కత్వం వహించిన ఇందిరాగాంధీ బలమైన, మహత్తరమైన భారత దేశం గురించిన కలలు కన్నారు. వాటిని నిజం చేయడానికి ఎంతో కృషి చేశారు. భారతదేశ ప్రజలకు శాంతిని, మానవాళికి అణ్వస్త్ర రహిత ప్రపంచాన్ని లక్ష్యంగా పెట్టుకున్నారు. అందుకు ఎంతో దోహదం చేశారు. ఢిల్లీ ప్రకటనపై ఆమె సంతకం చేయలేకపో యినప్పటికీ అందులో ఆమె సాంస్కృతిక, రాజకీయవారసత్వం వుంది అని అన్నారు గోరిన్.

# సహించనివాడు మనస్తత్వం

ఎ. సాతిరోవ్

ఒక పరిశోధనా సంస్థ, ఒక ఖాళీని నింపడానికి అభ్యర్థుల నుండి దరఖాస్తులను కోరింది పోటీ ప్రాతిపదికపై ఎంపిక జరుగుతుందని ప్రకటించింది. ఈ వుద్యోగం కోసం ముగ్గురు వచ్చారు. అందులో ఒకర్ని పర్సనల్ మేనేజరు ఎంపిక చేశాడు

''మమ్మల్ని యెందుకు ఎంపిక చెయలేదండీ'' అని మిగతా యిద్దరు అడిగారు. పర్సనల్ మేనేజరు ఫైలు తీసి:

''ఈ రంగంలో కనీసం ఐదేళ్లు అనుభవమున్న వ్యక్తి యిందుకు అర్హుడు. ఎంపికైన వ్యక్తికి ఐదేళ్ల రెండు నెలల అనుభవముంది.''

''మరి నాకు పదేళ్ల అనుభవముంది'' అని ఒకరు గొణిగారు. ''నాకు పన్నెండేళ్ల అనుభవముంది'' అని రెండో వ్యక్తి అన్నాడు, వుద్యోగం తనకు ఖాయమేనననే ధీమాతో. ''మరో అర్హత: అభ్యర్థి పరిశోధించిన విషయాలు ప్రచురణ భాగ్యానికి నోచుకోవాలి. ఎంపికైన అభ్యర్థి రచనలు రెండు ప్రచురితమయ్యాయి.''

''అయ్యా, నా రచనలు యిరవై ప్రచురితమయ్యాయి'' అని ఒకరు బల్లగుద్ది చెప్పగా, ''పద్దెనిమిది'' అని రెండో వ్యక్తి నెమ్మదిగా అన్నాడు.

''అంతేకాదు, కనీసం ఒక విదేశీ భాష తెలిసుండాలి, ఎంపికైన వ్యక్తికి యింగ్లీషొచ్చు'' అన్నాడు పర్సనల్ మేనేజరు.

''నాకు మూడు విదేశీ భాషలొచ్చు'' అని అన్నాడు



చిత్రం: యూరి అఫోనిన్

మొదటి వ్యక్తి వుద్యోగం తనకేననే భరోసాతో. "నాకు రెండు వచ్చు" అని అన్నాడు రెండో వ్యక్తి నిట్టూర్పుతూ.

పర్సనల్ మేనేజర్‌కు ఏమీ తోచలేదు.

"మీ పూర్తి పేర్లు చెప్పండి"

"యూరి సిదొరోవ్"

"గియోర్గి దుమోవ్"

"యీ వుద్యోగానికి ప్యొత్ర్ షెవెలేవ్ అనే పేరు గల వ్యక్తి మాత్రమే కావాలి. యిక మీరు వెళ్ళొచ్చు" అన్నాడు పర్సనల్ మేనేజర్. దీంతో మౌనం రాజ్యమేలింది. అయినా వారేదో వ్యాఖ్యానించదలచుకున్నారు.

ప్రత్యేక సమాచారం

## చెర్నోబిల్‌లో యీనాడు.

చెర్నోబిల్ అణు విద్యుత్కేంద్రంలో జరిగిన ప్రమాదం వల్ల తలెత్తిన పర్యవసానాలను తొలగించడానికి శాస్త్రవేత్తలు, నిపుణులు యెంతో కృషి చేశారు. ధ్వంసమైన యూనిట్‌ను పూర్తిగా మూసివేశారు. ఆ ప్రాంతాన్ని, నిర్మాణ చట్రాలను, పరికరాలను శుద్ధి చేశారు. విద్యుత్కేంద్రంలో రేడియో ధార్మికత మామూలు స్థాయికి చేరుకున్నది. విద్యుత్ కేంద్రంలోని మిగతా మూడు యూనిట్లు పనిచేస్తున్నాయి.



## ఏడు దశాబ్దాల సోవియట్ పెయింటింగ్స్

ధైర్య సాహసాలకూ, కళల పట్ల శ్రద్ధాంకిత భావానికీ, బరీస్‌కు స్తదీయెవ్ (1878-1927)జీవితం ఆదర్శప్రాయమైనది. 34వ యేట వచ్చిన మొండి వ్యాధి మూలంగా జీవితాంతం చక్రాల కుర్చీలోనే ఆయన గడపవలసి వచ్చినప్పటికీ చివరి శ్వాస విడిచేదాకా యెంతో చురుగ్గా పనిచేశారు. ఆయన కొన్ని డజన్ల చిత్ర పటాలను, జన సామాన్య జీవిత చిత్రాలను వేశారు. ఆయన స్టెనోగ్రాఫర్‌గా పనిచేశారు. పుస్తకాల కోసం అనేక బొమ్మలు వేశారు. మంత్రముగ్ధుల్నీ చేసే అద్భుత దీపం లాంటిది ఆయన జీవితం. పైకి మామూలుగా కనిపించినా పరిపూర్ణమయిన అవగాహన శక్తి ఆయన కుండేది.

టూకీగా



మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | KLVA105M235 |
| పుస్తకం పేరు | సోవియట్ సమీక్ష |
| తారీఖు | 07 February 2025 |
| ముందు అట్ట | Yes |
| వెనుక అట్ట | Yes |
| మొత్తం పేజీలు | 69 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Vedavathi. |
| పేజీలు విడదీసినది | Vedavathi. |
| స్కాన్ చేసినది | S.Lakshmi |
| పరీక్ష చేసినది | HEMA |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good. |